ఓం.

# మహా భాషిత రత్నాకరం



# మహో భాషిత రత్నాకరం

గ్రంథకర్త;

మహాత్మా గాంధిగారు.

సంపాదకులు.

డి. వి. ఈశ్వర్లు గారు



ప్రకాశకులు.

# పరిచయము

అత్యంత పూజనీయులగు మహాత్మాగాంధిజీ ప్రోక్తమగు యిమ్మహా భాషిత రత్నాకరము నందలి 11 (పదునొకండు) హితోపదేశములు సబర్మతీ ఆశ్రమ నిబంధనలు. ఇయ్యవి తదాశ్రమ వాసుల కోరికలపై మహాత్ములవారు వారమున కొక్కొక్కటిగా లేఖాముఖమున నొసంగిరి. తక్కుంగల మహోపదేశములును వేరువేరు సమయములయందు మహనీయులగు కొందరి యభిమతముల నాలించి బాబుజీ యుపదేశించి యుండిరి. పవిత్రమగు నేతద్భాషితముల ఆధిక్యతను గమనించి ప్రచురించు టత్యవసరమని దలంచి ది 2-4-1932 న మహాత్మునకు మా విజ్ఞప్తి నెరిగించుచూ కొండొక వాంఛమును గురించి వారి యభిప్రాయమును యాచించితిమి. దురదృష్ట వశమున ఆ కరుణామయుడు ఆవిషయమునుగూర్చి తన స్వీయాదేశము నొసంగమి యద్దానిని పాఠకుల కర్పించు కొనజాల మైతిమి.

మూలములు లభించని హేతువుచే అనువాదములనే ఆధారములుగ గైకొనవలసి వచ్చెను. మహాత్మాగాంధి గారి భాషితము అగుట వలనను, సర్వమత సమ్మతములును, అగాధములును నగుట వీనిని మహా భాషిత రత్నాకర మను పేర ముద్రించితిమి.

సంపాదకుడు.

# విషయసూచిక

# సత్యపథము. 1.

• సత్యదర్శన మార్గము అహింసయే! గాని, ఈ సత్యమార్గము, రజూపద్ధతిగా నిర్వ్యక్రమముగనున్నది. అందువల్ల ఈ మార్గముచాల యిరుకుగాను సన్నముగాను యున్నది.

ఈ ధర్మగతి కత్తియంచు నడకవంటిది. ఇది అసిధారావ్రత చర్య: సన్నని త్రాడుమీద నడచు దొమ్మర వాని కెంత యేకాగ్ర చిత్తముండవలయునో, అంతకన్న నెక్కుడగు ఏకాగ్రచిత్తము ధర్మగతి ననుగమించువాని కలవడవలయును. ఏమాత్రము పరాకు చిత్తగించినను తప్పక అధఃపతితుడగును. మనగమనము మనమార్గము అనుక్షణముగమనించుచుండవలెను.

సత్యస్వరూపమునుగూర్చిన పరిపూర్ణ జ్ఞానానుభవము యీ మర్త్యలోకములో అనుభవము. శరీరము అనుక్షణము మార్పుల నొందుచున్నది. కాని సత్యమనునది నిత్యమైనది. భక్తివిశ్వాసములవల్లనే సత్యము అనుభవైకవేద్యమగును. ఈ రీతి ననుసరించియే సత్యాన్వేషకులు అహింసాతత్త్వమును దెలిసికొనగలిగిరి.

సత్యమును అన్వేషించెడువాడు అనేక సాధనమార్గములను అనుష్ఠించుటకు స్వతంత్రుడై మార్గనిర్ణయము చేసికొనవలసినవాడగును.

తన మార్గమధ్యమందు తానే అష్టకష్టములకోర్చి సత్యమును సాధించవలయునా? కాక, తన సంకల్పసిద్ధికై యడ్డువచ్చెడు వానిని నాశనముచేయవలయునా? నిలయమార్గము ననుసరించెడు వారి పురోభివృద్ధిలేదు, అతడు సత్యమును సాధింపజాలండు. కష్టములను సహించి ఆత్మవశుడగుటవల్లనే ఆత్మకు పురోభివృద్ధికలదు. ఆత్మకు వికాసముకలదు. సత్యము అంతరాత్మయందిమిడియున్నది. బాహ్యప్రపంచమందులేదు. కాబట్టి ప్రతిబంధకములను నవి బాహ్యలోకములోలేవు. కనుక బాహ్యప్రపంచమునందలి వస్తువినాశమువల్ల సత్యమనునది అనుభవైకవేద్యము కాజాలదు.

దొంగవానిని దండించినంతమాత్రమున చౌర్యస్వభావము తొలగిపోదు. మనము బాధలకోర్చుటవల్లనే దొంగవానిని సంస్కరించుకొనగలము. ఈరీతిగా క్రమక్రమేణ సకల ప్రపంచమును మనము వశీకరణముచేసి భగవంతుని మహిమనే అలవరచుకొనగలము. బాధలు, కష్టములు సంప్రాప్తించిన కొలదియును, సత్యము మరింతబాగుగ వెలువడును. శాంతి సౌఖ్యము, ధైర్యము, పరాక్రమము మరింతబాగుగా వర్ధిల్లును. శాశ్వతమైనదేదో, క్షణభంగురమైనదేదో, విచక్షణగా తెలిసికొనగలుగుదుము. అహంకారము అంతరించును. మనము వినమ్రహృదయులమగుదుము. పరిగ్రహము తగ్గిపోవును. మనయందలిపాపచింత హరించిపోవును

తన మార్గమధ్యమందు తానే అష్టకష్టములకోర్చి సత్యమును సాధించవలయునా? కాక, తన సంకల్పసిద్ధికై యడ్డువచ్చెడు వానిని నాశనముచేయవలయునా? నిలయమార్గము ననుసరించెడు వారి పురోభివృద్ధిలేదు. అతడు సత్యమును సాధింపజాలడు. కష్టములను సహించి ఆత్మవశుడగుటవల్లనే ఆత్మకు పురోభివృద్ధికలదు. ఆత్మకు వికాసముకలదు. సత్యము అంతరాత్మయందిమిడియున్నది. బాహ్యప్రపంచమందులేదు. కాబట్టి ప్రతిబంధకములను నవి బాహ్యలోకములోలేవు. కనుక బాహ్యప్రపంచమునందలి వస్తువినాశమువల్ల సత్యమనునది అనుభవైకవేద్యము కాజాలదు.

దొంగవానిని దండించినంతమాత్రమున చౌర్యస్వభావము తొలగిపోదు. మనము బాధలకోర్చుటవల్లనే దొంగవానిని సంస్కరించుకొనగలము. ఈరీతిగా క్రమక్రమేణ సకల ప్రపంచమును మనము వశీకరణముచేసి భగవంతుని మహిమనే అలవరచుకొనగలము. బాధలు, కష్టములు సంప్రాప్తించిన కొలదియును, సత్యము మరింతబాగుగ వెలువడును. శాంతి సౌఖ్యము, ధైర్యము, పరాక్రమము మరింతబాగుగా వర్ధిల్లును. శాశ్వతమైనదేదో, క్షణభంగురమైనదేదో. విచక్షణగా తెలిసికొనగలుగుదుము. అహంకారము అంతరించును. మనము విశాలహృదయులమగుదుము. పరిగ్రహము తగ్గిపోవును. మనయందలిపాపచింత హరించిపోవును

---

# హింసా స్వరూపములు. 2.

అహింసయనగా శారీరక దౌర్జన్యనిరోధముగాదు. దుష్టచింతలు, నిగ్రహములేనియుద్రేకము, పగలకీడుగోరుట, ద్వేషము, అబద్ధములాడుట, ఇవన్నియు హింసాతత్వముయొక్క భిన్న స్వరూపములే. ఇతరుల కవసరమగువానిని తన వశమందుంచుకొనుటకూడ హింసయేయగును.

మన దేహాభిమానముకూడ మనము విడిచిపెట్టవలయును. తన దేహమును తాను మైమరచియున్న నిర్వృత్త్యావస్థయందే ఈశ్వరతత్వము అనుభవైకవేద్యమగును. ఈ శరీరము మనదికాదు, ఈ శరీరమునకు మనము ధర్మకర్తలమను భావముతో యీ శరీరమును మనము వినియోగించవలయును. అహింసానుసరణముచేయుట అసంభవము. సత్యము, అహింసా ఇవిరెండును అవినాభావసంబంధములు. ఒక నాణెమునకు రెండు ముఖములేరీతిగానున్నవో సత్యము, అహింస అన్యోన్యాశ్రయములు కాబట్టి సత్యము అను పరమావధి చేరుటకు అహింస యనునది సాధనమార్గము.

ఈ సాధనమే మనకు వశములోనున్న విషయము కాబట్టి అహింసాధర్మమే పరమకర్తవ్యము. ఈ సాధనమార్గమును మనము పట్టువీడక యనుసరించితిమేని ఎప్పటికైననొకప్పటికి మనము తప్పక పరమావధిని చేరగలము. సత్యమే భగవంతుడు. ఆభగవత్తత్వమును అనుభవైకవేద్య మొనరించుకొనుటకు ఒకటే మార్గముకలదు. ఆమార్గమే అహింసావ్రతము. దీనిని

మనమెన్నడును విసర్జింపరాదు. సత్యమే స్వరూపముగాఁగల యేభగవంతుని సంస్మరించి యీ అహింసాదీక్షాప్రమాణమును మేము చేయుచున్నామో ఆదీక్షాసంకల్పబలమునుకూడ ఆభగవంతుడే మాకనుగ్రహించుగాక!

---

# బ్రహ్మచర్యము. 3.

మన నియమముల కన్నిటికి ఆదికారణము సత్యమే! సత్యమును సందర్శింపగోరువాడు విషయేచ్ఛ నెటుల నారాధింపగలడు? సత్యమును సందర్శింపగలిగిన వారిలో నెవరునుగూడ మరల విషయభోగ లాలసులుగా నుండినట్లు మనము విని యుండలేదు. బ్రహ్మచర్య వ్రతానుష్ఠానముండిననే గాని అహింసానిరతిగూడ నుండజాలదు. ఒకపురుషుఁడు తన ప్రేమ నంతను నొకస్త్రీకి యర్పించునెడలను, ఒకస్త్రీ తన ప్రేమ నంతను నొకపురుషుని కర్పించునెడలను వారితరులకొసగుటకు మరల వారికడ ప్రేమ యెక్కడనుండును? అటుల కాఁగని మగ్నులగు స్త్రీలును, పురుషులునుగూడ ప్రపంచమంతయును తమకుటుంబమేయని భావింపజాలరు. ఎవరినో యొక్కరి నేమిక్కిలిగా ప్రేమించుచుండువారొక ప్రత్యేక ప్రపంచమునందే యుందురు గాన అట్టివారు విశ్వజీవకారుణ్యము నలవరచుకొనుటకు వ్యక్తిగతమగు ప్రేమ ప్రబలనిరోధకమే యగును. కావున అహింసానియమారాధకులగు వారు వివాహము చేసుకొనజా

లరు. వివాహమే చేసుకొనజాలనపుడు యితరులతో సంభోగ సౌఖ్యము ననుభవించవలెనని వారెట్లుల కోరగలుగుదురు?

## మానసిక ప్రభావము.

వివాహముచేసికొనిన వ్యక్తికి యెన్నటికినిగూడ సత్యసందర్శనము లభింపనే లభింపదా? సత్యమునుసందర్శింపగోరినచో వివాహమైనవారుగూడ వివాహము కానివారివలెనే నడచుకొనవలెను. స్త్రీ పురుషులు సోదర సోదరీలవలెనుండవలెను. కాని, ఒకరిపై నొకరికి విషయసుఖసంబంధమగు అనురాగ మెంతమాత్రము నుండకూడదు. ప్రపంచమునందలి స్త్రీలనందరిని తల్లులవలెను, అక్కచెల్లెండ్రవలెను, కుమార్తెలవలెను భావింపగలుగుటయే యొకగొప్ప ఆశయమైయున్నది. ఇది సిద్ధించిన వారు బంధవిముక్తులగుదురు. దీనివలన విశ్వకుటుంబమేర్పడును. భోగేచ్ఛ రూపుమాసి పోవును. ప్రేమ వృద్ధినొందును. స్వార్థపరత్వ మంతరించును, అప్పుడు పరస్పర వివాదములకవకాశమే యుండదు.

బ్రహ్మచర్యనియమమునకు వీర్యస్తంభనముకంటె మనోవిజయమే ముఖ్యతమము. మనోజయము మొదటిది. వీర్యస్తంభనము రెండవది. వీర్యస్తంభనమువలన శరీరాభివృద్ధి కలుగును. ఇట్టి యమూల్యమగు వీర్యమును విషయసుఖముకొరకు వ్యర్థపరచుట మిక్కిలి యవివేకము.

బ్రహ్మచర్యము మానసికముగను, వాచికముగను కాయికముగనుకూడ యుండవలెను. ఎవరైన సంభోగమును వర్జించినను

సంభోగమునుగూర్చిన కోరికను చంపజాలనిచో అట్టివారువంచకులే యగుదురు. శరీరము మనసున కధీనమైయుండును. గాన మనము మనస్సును నిగ్రహించినచో విజయమును బడయగలుగుదుము.

## స్త్రీపురుష వివక్షతే యింద్రియములు.

బ్రహ్మచర్యమనగా కేవలము సంభోగమును వర్జించుట మాత్రమేగాదు. కామోద్రేకమును కలిగించునట్టి మాటలను వినగూడదు. మనస్సును కలవరపెట్టునట్టి దృశ్యములను చూడగూడదు. సంభోగమును పురికొల్పునట్టి పదార్థములను తినగూడదు. కావున బ్రహ్మచర్యమునను ష్టింపగోరువారు సకలేంద్రియములనుగూడ నియమింపవలెను.

బ్రహ్మచర్యమను శబ్దమును కేవలము సంభోగమునకు మాత్రమే అన్వయింపచేయుటవలన చాలహాని కలిగినది. బ్రహ్మచర్యమనగా తపము. "సత్యమే పరబ్రహ్మము" అని గ్రహించుటకు యీతపము నొనర్పవలెను. దీనివలన సకలేంద్రియనిగ్రహణము గూడగలుగును. కావున బ్రహ్మచర్యమనగా సంభోగవర్జనము మాత్రమే అనునభిప్రాయమును మరచిపోవలెను.

---

# పరద్రవ్య విముఖత్వము. 4.

మనము దూరమాలోచించి ధర్మజిజ్ఞాస చేసినయెడల నీతిమార్గవిధులన్నియు సత్యమునే పరమావధిగా కలిగియున్నవి.

సత్యమునే ఆశ్రయించియున్నవి. సత్యమైన దాని ననుభవైక వేద్య మొనర్చుకొనుటయే జీవితపరమావధి. అహింసా స్వరూపమైన ప్రేమమార్గమే యీ పరమావధి చేరుటకు సాధనము. పరద్రవ్యాపహారణము చేయువాడు జీవకోటిని ప్రేమించు చున్నానని చెప్పగలడా? దొంగతనములు చేయుచు దయాదాక్షిణ్యములు కలిగియుండు టసంభవము. అట్టివానికి సత్యస్వరూపమగోచరము. ఇతరుల సొత్తును అపహరించుట మాత్రమే దొంగతనముకాదు. తన,కన్న కొడుకులుచూడకుండ చాటుమాటున తండ్రి యేదైన తినుచుండినయెడల అట్టి దొంగతిండి తినుటకూడ దొంగతనమే యగును. ఒకని యనుజ్ఞ వొందకుండ అతనిసొత్తు గైకొనునపుడు అతని కాసంగతి తెలిసినప్పటికి అతే ప్రకారమండినను అట్టికార్యము దొంగతనమే యగును. ఏదైన ఒకవస్తువు బేవారసుగా పడియున్నదని భావించి మనము వశపరచుకొన్నప్పటికిని అది దొంగతనమేయగును.

మనకవసరము లేనివస్తువు యింకొకని నడిగి తీసుకొనుట సైతము లోభమే! అదికూడ చౌర్యమే! నాక్షుత్పిపాసలకును, దేహావసరములకును మించిన పదార్థములను మిక్కుటముగా భుజించుటకూడ పరద్రవ్యాపహారణమే యగుచున్నది. సామాన్యముగా మనకేపదార్థ మెంతకావలయునో మనకే తెలియదు. మనలో చాలమంది తమవాంఛలను జీవితావసరములను పెంచుకొని హెచ్చించుకొనుచున్నారు. అందువలన మనము దురాశాపరులమై దొంగలమగుచున్నాము. కాబట్టి పరద్రవ్య విముఖత్వమును క్రమశః సాధకముచేయువాడు క్రమశః తన జీవిత

వాంఛలను తగ్గించివేయగలదు. ప్రపంచములోగల దారిద్ర్యము మూడు ముప్పాతిక మువ్వీసము లోభమువల్లనే కలుగుచున్నది.

పైచెప్పిన దొంగతనముకన్న సూక్ష్మమైన యింకొక చౌర్యముగలదు. ఇది ఆత్మవికాసమునకు వేరుపురుగువంటిది. ఇతరులసొత్తు తనకుకావలెనని మనసులో ఆశించుటకూడ చౌర్యమేయగును. ఇది దొంగబుద్ధి, దురాశ, ఏదైనరమ్యమైన వస్తువును చూచినప్పుడు అది తనకు కావలెనని కోరుట కూడదు. అది పేరాశ ఉపవాసము చేయువాడు చిత్తచపలత్వము గలిగి భోజ్యములకై వాంఛించుటవల్ల ఉపవాసప్రతిఫలము శూన్యమగుటయేగాక, నిషిద్ధవస్తువు నాశించుట కలిగిన దొంగబుద్ధిగల చోరుడగుచున్నాడు. ఉపవాసదినమున చిత్తచాంచల్యమువలన ఆహారవిషయమై ఆలోచించుచు, మరి వాటి వంటకమునుగూర్చి యూహించుటకూడ దొంగబుద్ధియే యగును. పరద్రవ్యసంగ్రహణ కాంక్షారాహిత్యమును సాధనము చేయగల్గువాడు భవిష్యత్తునుగూర్చి దిగులుపడడు. రేపటి జరుగుబాటుయెట్లు? అను దిగులువలననే! ప్రపంచములో చౌర్యము జరుగుచున్నది.

ఇతరుల భావరచనలను తనవేయని ప్రకటించుకొనుట, గ్రంథచౌర్యముకూడ నపరాధమే? కాబట్టి చౌర్యరాహిత్య వ్రతమువలంభించువాడు, బహు వినమ్రుడై,జాగరూకుడై,వివేచనాపరుడై, నిరాడంబరుడై వర్తించవలెను.

# స్వార్థ విరహితత్వము. 5.

స్వార్థవిరహితత్వము పరద్రవ్యాపేక్షా సన్నిహిత ధరములు. తనకు అవసరములేని పదార్థమును తనవశమందుంచుకొనుటగూడ దొంగతనమే యగును. ఆపదార్థమును తాను దొంగిలించియుండకపోయినను అది చోరీ ఆస్తివలెనే పరిగణింపవలెను. ఆస్తి దాచుకొనుటకు గల అర్థమేమి? రాగల దినములకు ముందు జాగ్రతపడి నిలువజేయుటయే! సత్యమార్గాన్వేషియగువాడును, అహింసాక్షేమ ధర్మావలంబియగువాడును, రేపటికొరకు యేదియును భద్రపరచి యుంచజాలడు. భవిష్యత్కాలమునకై సరిపోవు పదార్థమునుగాని, సంవత్సరములకొలది సరిపడుపదార్థమునుగాని, భగవంతుడే సృజించుటలేదు. ఏనాటికానాటికి సరిపోవు పదార్థముకన్న నెక్కుడుగ ఈశ్వరుడు సృజించుటలేదు. అట్టి భగవంతునియందు మనము విశ్వసించెడివారమైన యెడల, మన యనుదినాహారమును, ఆ భగవంతుడే సమకూర్పగలడని నమ్మియుండవలెను. మన కెంతవరకు కావలెనో అంతవరకును యిచ్చును. అట్టి సంపూర్ణ విశ్వాసముతో ప్రవర్తించిన మహాభక్తులును, పరమ యోగీంద్రులును తమ యనుభవముచే యీ సిద్ధాంతము సత్యసమన్వితమని గ్రహించిరి.

ఈ సిద్ధాంతము ననుసరించి మానవుడు తన యనుదినాహారమునే తాను గైకొనుచుండవలెనను యీశ్వర సంకల్పమును మనము నిర్లక్ష్యము చేయుచున్నారము.

భాగ్యవంతులయొద్ద వారి భుక్తికిమించిన ద్రవ్యము నిలువయుండును. అందుచేత ఆ ద్రవ్యమునెడల వారికి లక్ష్యముండదు. అది వ్యర్థమై దుర్వినియోగమగుచుండును. కాని కోట్లకొలది మానవకోటి లేమిడిచే కాళ్ళుచేతులు చల్లబడి మృత్యువువాతబడుచున్నారు. ప్రతివాడును తన జీవితావసరమైన పదార్థమునే తనవశమందుంచుకొన్నయెడల లేమిడి యెవరికిని యుండదు. అందరును సంతుష్టులయి జీవింపగలరు. కాని ప్రపంచ ధర్మమునుబట్టి పేదలకన్న భాగ్యశీలురే యెక్కువ యసంతుష్టులై యున్నారు. పేదవారికి కడుపు నిండిన మాత్రమున వారు తృప్తిచెందుట లేదు, కాని, వారు అంతమాత్రమైనను పొందుటకు హక్కుదారులయి యున్నారు. వారికి అంత మాత్రమైనను లభించునట్లు చేయుట సంఘముయొక్క విధియై యున్నది. విశ్వమానవ సంతుష్టి వెల్లివిరియుటకై భాగ్యవంతులీ విషయములో ముందంజవేయవలయును. భాగ్యవంతులు తమ ఆస్తిసంపదలకు మితి యేర్పరచుకొన్నయెడల పేదలకు సులభముగా తిండి లభింపగలదు. భాగ్యవంతులజూచి వారును లభ్యమైనదానితో సంతుష్టినొందుట నేర్చుకొనగలరు.

స్వార్థ విరహితత్వ ధర్మము పరిపక్వ దశకు వచ్చినప్పుడు మానవుడుకూడ పక్షులవలెనే తలదాచుకొనుటకు యిల్లు వాకిలి లేకుండ నుండవలెను. ఒడలిపై దుస్తులు లేకుండ నుండవలెను. రేపటికై నేడు పదార్థము స్వీకరించరాదు. అతనికి అనుదినాహారమును కావలసియే యుండును. కాని అవి సమకూర్చుట భగవంతుని కర్తవ్యము గాని, మానవునిదిగాదు.

## నాగరికతా నిర్వచనము.

ఈరీతిగా ఆదర్శప్రాయముగా నుండగలవారు అత్యల్ప సంఖ్యాకులు. సాధారణ సత్యాన్వేషకులమైన మనము ఈ యాదర్శమును మనసునం దిడుకొని, తదనుగుణముగా మన యాస్తిసంపదలను శ్రద్ధగా పరిశీలనచేసి తగ్గించుట కనుదినమును యత్నముచేయ గలుగుదుము.

మన విషయసౌఖ్యములను వాంఛలను పెంపొందించుట నాగరికత గాదు. మన నిత్యకృత్యావసరములను, దేహ వాంఛలను బుద్ధిపూర్వకముగా తగ్గించివేయుటవల్లనే మన కానందమును, నిజమైన సంతుష్టియును మానవసేవా సామర్థ్యమును కలుగుచుండును. ఈ పరీక్షాప్రమాణమును బట్టి విమర్శించిన యెడల ఇప్పు డాశ్రమములోయున్న అనేకవస్తువులు యుండవలసినవేయని సమర్థించుటకు వీలులేదు. అట్టి వస్తుసామగ్రి యుండుటవలననే ఇతరుల కపహరించవలెననెడి చిత్తచాంచల్యము కలుగుచున్నది.

ఎవని జీవితావసరములను వాడు క్రమశః సంకల్పబలముచే తగ్గించుకొనవీలున్నది. అట్టి తగ్గింపువల్లనే అతని కానందము లభించును. అట్టివానికే దేహస్వాస్థ్యము, చిత్తశాంతి కలుగును. కేవల సత్యదృష్టితో పరికించినచో దేహముకూడ నిజముగా జీవాత్మ సంపాదించిన వస్తువైయున్నది. మనము విషయ సౌఖ్యాసక్తి వీడకపోవుటవలననే జీవాత్మ యీదేహమునందు బంధింపబడుచున్నది. ఈ విషయవాంఛ నశించుటతోడనే

ఇక దేహధారణ మనవసరమగును. పునరావృత్తి రహితమై జీవుడు జననమరణ పరంపరలనుండి విముక్తినొందును. జీవాత్మసర్వాంతర్యామి, అట్టిది యీదేహపంజరములో బంధింపబడి దుష్కార్యముల నేలచేయవలెను? ఆపంజర సంరక్షణార్థమై హింసలేల చేయవలెను?

## సంపూర్ణ పరిత్యాగము.

ఈ ప్రకారముగా మనము సర్వసంగ పరిత్యాగమనెడి దివ్యాదర్శము గ్రహించగలము. "పరోపకారార్థమిదంశరీరమ్మని గ్రహించి దేహమున్నంతకాలమును, దేహమును మానవసేవకే వినియోగించగలము. పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్- భాషించుచున్, హాస, లీలా, నిద్రాదులు చేయుచున్, మనము మానవసేవాగ్ని మప్రమత్తులమై యుండగలము. దీనిచేతనే మనకు నిశ్చయమైన ఆనందము లభించును. జీవితపరిపక్వమునుబట్టి దివ్యసందర్శనానుభవము కూడ గలుగును. ఈ దృక్పథముతో మనయాస్తి వసతులను పరిశీలించెదముగాక.

వస్తుసామగ్రి విషయములోనేగాక, మనభావప్రపంచమునందును యీస్వార్థ విరహితత్వ సిద్ధాంతము వర్తించును. వ్యర్థవిషయజ్ఞానముతో తనమేధస్సును నింపువాడు యీయమూల్య సిద్ధాంతమును ధిక్కరించినవాడగును. భగవంతునియెడల మనకు విముఖత్వము కలుగజేయునట్టి తలంపులును, భగవంతుని యెడ సుముఖులనుగా చేయునట్టి తలంపులును మన జీవితమునకు ప్రతిబంధములే! అట్టివానిని తొలగించవలెను. ఈసంద

ర్భముతో భగవద్గీత 13 వ అధ్యాయములో చెప్పబడిన జ్ఞాన నిర్వచనము యోచింపదగియున్నది. వినమ్రభావము (అమానిత్వము) మొదలగునవి జ్ఞానలక్షణములనియు మిగిలినదంతయు అజ్ఞానమనియు చెప్పబడినది. ఇది నిజమైనదైనయెడల నిజమనుటకెట్టి సందేహమునులేదు. మన మీయుగమునందు జ్ఞానమని స్వీకరించునదంతయు అజ్ఞానమే. దీనివల్ల మనకు మేలుకలుగుటకుమారు హాని కలుగుచున్నది. ఈ రీతిగా వాదించుటవల్ల స్తబ్ధత్వమే యుండవలెననుటలేదు. మన జీవితములోని ప్రతిక్షణమును మనము కార్యనిమగ్నులమై యుండవలెను; కాని, ఆకార్యదీక్ష సాత్వికమైనదిగా యుండవలెను. సత్యమునకు మార్గదర్శిగానుండవలెను. నిరంతర పరోపకార సేవార్థము తనజీవితము నర్పించువాడు ఒక్కక్షణమైనను నిర్వ్యాపారియై యుండజాలడు. కాని, సద్వ్యాపారమునకును, దుర్వ్యాపారమునకును, భేదము గ్రహింపవలెను. తదేక సంకల్పముతో పరోపకార పారీణుడైనవానికి, ఆ విచక్షణాజ్ఞానము సహజసిద్ధముగా కలుగును.

---

# నిర్భయత్వము. 6.

భగవద్గీతలో 16వ అధ్యాయమున భగవానుడు శ్రీకృష్ణుడువివరించిన దైవసంపదకు సంబంధించిన లక్షణములలో నిర్భయత్వమును మొట్టమొదట పేర్కొనెను విషయము, అపవిత్ర గ్రం

ధమును చదువువారి కందరకును తెలిసియేయున్నది. నిర్భయత్వమున అంతర్గతము, బహిర్గతము అను రెండువిధములు గలవు. ఇతరములగు ఉదార లక్షణము లన్నిటికిని గూడ నిదియే! ముఖ్యాధారముగూడ నగును. నిర్భయుడు కానివాడు సత్యమును గాని ప్రేమనుగాని యెటుల నలవరచుకొనగలడు? శ్రీహరి మార్గమును ధీరులేగాని, భీరులెన్నడునుగూడ ననుగమింపలేదు. శ్రీహరియనగా సత్యమే! నిర్భయత్వము గలవారే ధీరులన బరగుదురుగాని, కేవలము ఖడ్గాది మారణసాధనములను ధరించినంత మాత్రమున యెవ్వరును ధీరులన బడదగరు. బహిర్గతములనునట్టి సకల విధములగు భయములనండియు వ్యాధులు, శరీరమున కాపదలు, మరణము, ధననష్టము, ఆప్తబంధువులను గోల్పోవుట, అపకీర్తికలుగుట మున్నగు సకల విధములగు భయములను జయింపగలుగుటయే నిర్భయత్వమనదగును.

ఒకడు మరణభీతిని జయింపగలిగినచో వాడు తక్కినఅన్ని భయములను సైతము జయింపగలిగినవాడే అని లోకులు పొరపాటుగా భావించుచుందురేగాని, అది యెంతమాత్రమును నిజముకాదు. ఒకనికి మరణమనిన భయము లేకపోవచ్చునుగాని, యితరములగు అల్పబాధలకువాడు భయపడుచునేయుండును. కొందరు ఆప్తబంధువులను విడచి యుండజాలరు. కొందరు లోభులు ప్రాణమును వదలుటకైన సమ్మతింతురుకాని, ధనమును వదలుటకెన్నడును సమ్మతింపజాలరు.

సత్యమును సందర్శింపవలెనని మనఃపూర్వముగా కోరునట్టి

సాధకుడు అన్నివిధములగు భయములను జయించుటయే కాక, హరిశ్చంద్రచక్రవర్తి సత్యముకొరకు తన సర్వస్వమును త్యజించినట్లు సత్యస్వరూపుడగు శ్రీహరికి సర్వసమర్పణము గావింపవలెను. సకల విధములగు భ్రాంతులును తొలగిననేగాని సంపూర్ణమగు నిర్భయత్వము కలుగదు. భగవదపరోక్షమును బడసిననేగాని అనగా బింబమూర్తి సందర్శనము లభించిననే గాని, భ్రాంతు లన్నియును పూర్తిగా తొలగిపోవు. కాని దృఢతమమగు ఆత్మవిశ్వాసముతో, గట్టిదీక్షను బూని నిరంతరమును జాగరూకతతో నుండువాడు సత్యమార్గమునం దెల్లపుడును పురోగమనము సలుప గలుగును.

కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములు అంతర్గతము అగు భయములై యున్నవి. అంతర్గతములగు భయములను జయింపగలిగినవాడు, బహిర్గతములగు భయముల నవలీలగనే జయింపగలుగును. భయములన్నియును భౌతికశరీరమునకు సంబంధించినవేగాన, శరీరాభిమానమును చంపగలిగినవానికి వెంటనే అన్ని భయములునుగూడ తొలగిచనును. భయమనునది మన భావమునకు సంబంధించిన నిరాధారమగు భ్రాంతి. సంపద, బంధువర్గము, శరీరము, మున్నగు వాటిపైని మమకారమును ఛేదింపగలిగినవాని కెట్టిభయమును గలుగజాలదు. ధనము, కుటుంబము, శరీరము మున్నగునవి వెనుకటివలెనే యుండును. వాటిని మనము త్యజింపబని లేదుకాని, వాటిపట్ల మనభావమున మాత్రము మార్పునుపొందవలయును. మనము, కేవలముభగవంతుని అనుచరులము. భగవదాజ్ఞానుసారము వీటిని మనము

భద్రముగా కాపాడుచు సద్వినియోగ మొనరించుచుండవలెను అని మనము భావించుచుండుటయే! మనభావమునందు కలుగవలసినమార్పు. నేనేస్వామిని, యివియన్నియును నావేయను భ్రాంతిని విడనాడి, స్వామిసర్వేశ్వరుడు, నేనతని భృత్యుడను అనుసత్యమును పూర్తిగా గ్రహింపవలెను. నాపాదముల కంటుకొనియుండు యిసుకరేణువులకంటెనుగూడ నేనధముడను, అని దృఢముగా నెప్పుడొకడు నమ్మగలుగునో! అపుడే, అన్నివిధములగు భయములునుగూడ మంచువిరిసిపోవునట్లు తత్క్షణమే తొలగిపోవును. అప్పుడు మనము సంపూర్ణమగు చిత్తశాంతి కలుగును. గాన సత్యనారాయణుని ప్రత్యక్షముగా చూడ కలుగుదుము.

---

# అస్పృశ్యత. 7.

అస్పృశ్యత యెంతవరకు న్యాయము? ముట్టుకొన్నచో అపరిశుభ్రత యేర్పడునని అస్పృశ్యతకు భావము. కాని, యెక్కడెక్కడ అస్పృశ్యతయున్నదో అచ్చట కేవల మొక ఆచారము యేర్పడుచున్నది. ఈ యాచారమువచ్చి మతమును పాడుచేయుచున్నది. అందరును ఒక్క తేజస్సునుండి యుద్భవించిన యంశములే. ఇట్టిచో యెవ్వరును అస్పృశ్యులు గాజాలరు. మానవులను అస్పృశ్యులనుగా, భావించుట తప్పు. ఒక మృతశరీరమును తాకుచో అర్థములేని నియమములను

గూర్చి ఆలోచించుటతప్పు. ఒక కళేబరమును ముట్టుకొన్నప్పుడు గాని, లేక మనము క్షౌరము చేయించుకొన్నప్పుడుగాని కేవలము ఆరోగ్యమునకు సంబంధించిన కారణముచేతనే మనము స్నానము చేయుచున్నాము. స్నానము చేయనివానికి పరిశుభ్రత లేదని చెప్పవచ్చును గాని, అతనిని పాపాత్ముడనుటకు వీలులేదు. బిడ్డమలము నెత్తివైచినప్పుడు తల్లి తనచేతులను పరిశుభ్రపరచుకొనువరకును అస్పృశ్యయే యగును. కాని, ఆడుకొనుచు ఆడుకొనుచు శిశువు తల్లిని ముట్టుకొన్న దనుకొనుడు; అప్పుడామె కపవిత్రత రాదు. ఇంకనైనను చమార్ల(పంచములు) మున్నగువారిని వారు స్నానముచేసినను సరే! గీతచదువుచున్నను సరే! మంచివృత్తి నవలంబించినను సరే! అస్పృశ్యులనియే మనము భావించుచున్నాము. ఇది మతముకాదు. కేవల దుర్మతము. దీనిని ధ్వంసము చేయవలయును.

అస్పృశ్యత నివారించుట ప్రతిహిందువునకు విధి. అస్పృశ్యత విధ్వంసాత్మకమైన, పాపభూయిష్టమైన గ్రుడ్డినమ్మకము అంటురోగమువలె హిందూ వ్యము నిది యాక్రమించినది. దీనిని నివారించుటకు ప్రయత్నించుట ప్రతి హైందవునకు విధి. ఈ అస్పృశ్యతను నివారించి ప్రేమభావముతో, సేవాకాంక్షతో, ఓరిమివహించి, వారి నజ్ఞానమునుండి తొలగించి ప్రతి హైందవుడును యీ అస్పృశ్యతను పరిహారమొసంగవలయును. అస్పృశ్యులను సోదరులుగ జూచుకొనవలయును. అస్పృశ్యతా నివారణమునందుగల యీ ఆధ్యాత్మిక ప్రాధాన్యమునందు దాని భౌతిక రాజకీయ ప్రాముఖ్యము కేవలమప్రధానమైపోవును.

ఈ అస్పృశ్యతవలన పరిణామముల కంతములేదు. వానిని సమర్థించువారీ భూమికొక భారము. అస్పృశ్యులతో స్నేహము చేసినంతమాత్రమున చాలదు. మనపై మనకెంత ప్రేమ యుండునో, వారిపైకూడ మనకంతటి ప్రేమను చూపవలయును. అస్పృశ్యతానివారణయన్న మానవులకు మానవులకును, సంఘములకు సంఘములకును, నడుమగల యడ్డంకులను ధ్వంసమొనర్చుటయనియర్థము. ప్రపంచమునందంతటను యిట్టి యడ్డంకులు గలవు. కాని హిందూదేశములో నీయస్పృశ్యతను మతమే యంగీకరించుచున్నదను తప్పుటభిప్రాయమొకటి యున్నది. ఇది యేడుకోట్లమంది ప్రజల నొకవిధముగ బానిసలుగ చేసి వైచుచున్నది అందుచేత నీ యస్పృశ్యతా నివారణమే మన కిప్పుడు ముఖ్యముగా కావలసినది.

---

## కాయకష్టము 8.

టాల్‌స్టాయి మహాశయుడు రచియించిన బరిశ్రమ, సోమరితనము, అను వ్యాసమును చదివిన తరువాత బ్రతుకుటకుగాను ప్రతిమనుష్యుడును కాయకష్టము చేయవలెనను ధర్మసూత్రమును నేను తెలిసికొంటిని. రస్కిన్ రచియించిన 'అంటుదిలాస్టు' అను గ్రంథమును చదివిన తరువాత ఆసూత్రమును ఆచరణయందుంచ మొదలిడితిని. ఏదోపనిచేసి తన స్వేదమున లభించిన యాహారమునే మనుష్యులు గ్రహింపవలెనను దైవకల్పిత శాసన

ము నా భావములను దోహదమొనరించెను. భగవద్గీతలో మూడవ వయధ్యాయమున నీ ధర్మమే యుపదేశింపబడినది. జీవ యజ్ఞాదులను నిర్వర్తించి దానిలో మిగిలిన యవశిష్టమును భుజించుచో పురుషునికి కిల్బిషము లంటవనియు, అట్లు చేయనిచో పాపకర్మ నియమములు పొందుననియు చెప్పు నప్పుడు కాయకష్టము చేసి తమయాహారమును సంపాదించు కొనవలెనను ధర్మమే యుపపాదింపబడినదని నాయుద్దేశ్యము. కావున 'యజ్ఞము, అను పదమునకు ఆహారమును సంపాదించు కర్మయనియే యర్థము చెప్పవలయును. సత్యజిజ్ఞాసవలన గూడ నీ విషయమే తెలుచున్నది. పనియేమియు చేయనివాడు తినుటకేమియధికారమును గలిగియుండును? బైబిల్‌లో 'కష్టపడి ముఖమునుండి తుడిచిన చెమటవలన నీయాహారమును భుజించుము' అనియున్నది.

ఎంత సంపదతో తులదూగుచున్నను, అహర్నిశలు హంసతూలికా తల్పముపై పొరలాడుచున్నను, అన్నము తెచ్చి నోటికందిచ్చు సేవక సమూహము లెన్నియున్నను పనితేనిచో లక్షాధికారి అయినను, కోటీశ్వరుడయినను చాలకాలము గడుపజాలడు. అన్నము పచనమగుటకు అతడేదియేని వ్యాయామమునయినను చేయవలెను. ధనికుడయినను, నిర్ధనుడయినను, అన్నము బాగుగా పచనమగుటకు యేదో వ్యాయామము చేయవలసినచో అవ్యాయామము అన్న సంపాదకమగు కాయకష్టమేల కారాదు?

బాగుగా గాలిని పీల్చుకొనుమనిగాని, కండరములకు పుష్టి

నిచ్చువాళ్లు వ్యాయామము చేయుమనిగాని, వ్యవసాయిదారు నెవ్వనిను కోరరాగదా? మానవ ప్రపంచములో నూటికి 9 వంతులు సేద్యము వలననే జీవించుచున్నారు. కాయకష్టము వలన జీవించు నీ 90 మంది యొక్క యుత్తమమార్గమును, మిగిలిన 10 మందికూడ అవలంబించుచో, ప్రపంచ మింకెంత సుఖవంతమును, భాగ్యవంతమును, శాంతియుతమును కాగలదు? వీరుకూడ వ్యవసాయ వృత్తి నవలంభించుటచేత వ్యవసాయ సంబంధమైన కష్టములన్నియు తొలగును. తెలివితేటలును, సాహసోత్సాహములును కలవారు కర్షకులకు బాగుగా సాయము చేయగలుగుదురు. మరియు కష్టించి గడించిన ధనమును భోగించుట తమ ధర్మమని ప్రతివారును తెలిసికొనుచో అనవసరమగు తారతమ్యములు మాయమగును. ఈ తారతమ్యములు వర్ణ ధర్మములోనికి దిగినవి. సాహుకారులకును, కార్మికులకును ప్రపంచమందంతటను సంఘర్షణజరుగుచున్నది. ధనికుల సంపద నుగాంచి బీదలు యోర్వలేకున్నారు. ప్రతివారును కష్టించి ధనము సంపాదించుచో నీ తారతమ్యములు మనస్పర్థలు ఓర్వలేనితనము మాయమగును.

బ్రాహ్మణ్యాభిమానముతో ప్రవర్తించువారికిని, సత్యదీక్షగలవారికిని, కాయకష్టము చేసి ఆహారమును సంపాదించుకొనుట నిజముగా వరప్రసాదమువంటిదే: ఒక్క వ్యవసాయమునకే కాయకష్టము సంబంధించి యుండగలదు. ప్రస్తుతము ప్రతివాడు వ్యవసాయవృత్తి నవలంభింపగల స్థితియందు లేడు.

కావున వీలుకానివారు నూలువడుకవచ్చును. బట్టలు

నేయవచ్చును, వడ్రంగము, కమ్మరము మొదలయిన వృత్తులను అవలంబింపవచ్చును. ప్రతివారును తమ పాకీపనిని తామే స్వయముగా చేసికొనవలెను. ప్రతి కుటుంబమును తమ పాకీదొడ్లను తామే స్వయముగా బాగుచేసికొనవలెను. పాకీపని యొక ప్రత్యేక కులమునకే విడిచుటలో మన సంఘమునందే దోషము ప్రవేశించినదని నేను చాలాకాలమునుండి తలచుచుంటిని. ఇంత ముఖ్యమగు ప్రజాపారిశుద్ధ్య కర్మమునకు సంఘములో నింత గౌరవహీనమగు స్థాన మెవ్వరిచ్చిరో చరిత్ర ద్వారా మనకు తెలియుటలేదు. అతఁడెవ్వఁడయిన నేమి? ఆయన మనకు మేలుచేసినవాఁడు కాఁడు. మనమందరము పాకీవారమే యను భావము బాల్యమునుండి మనమనములయందు నాటుకొనునట్లు చేయుట యవసరము. దీని యావశ్యకతను గమనించినవారందరు పాకీపనిచేసి తమయాహారమును, సంపాదించుటకు గడంగుటయే! దీనిం జేయుటకు మిక్కిలి సులభమగు మార్గము. తెలివితేటలుగలవారు పాకీపని నవలంభించుటవలన మలమూత్రముల నిజమైన యర్థము బోధపడును. బాలురును, వృద్ధులును రోగగ్రస్తులగుటచే అశక్తులయినవారును కాయకర్మ సిద్ధాంతమునకు భిన్నముగా ప్రవర్తింపవలసిన యవసరము లేదు. చిన్నపిల్ల తల్లిలో చేరుచున్నది. ఎవ్వరును యీ ధర్మమునకు భిన్నముగా ప్రవర్తింపనిచో మనుష్యులు దృఢకాయులయ్యెదరు. మానవులు రోగమునకు దూరులగుదురు.

---

# మతము. 9.

(పరమతసహనము) టాలరెన్సు అను శబ్దము సాకల్యతగా నచ్చలేదు. కాని, యింతకంటె మంచిపదము నాకు దొరకనందున దీనినే వాడితిని. సహనమని యనుటవలన తనమతము కంటె తక్కిన మతములన్నియును తక్కువ యను నొక యనుచితమగు నభిప్రాయమేర్పడును. "స్వమతము నెటుల గౌరవింతుమో యితర మతములనుగూడ నటులనే గౌరవింతుము" అని అహింసా సిద్ధాంతము శాసించుచున్నది. అనగా తక్కిన మతములవలె మనమతముగూడ లోపభూయిష్ఠమేయని తెలుపుటయే. సత్యముతోను, ప్రేమతోను, కూడిన మార్గము ననుసరించువాడిది నిజమని అంగీకరించుటకు యెంతమాత్రము వెనుదీయడు. మనము సత్యస్వరూపమును పూర్తిగా సందర్శింపగల్గినచో మనము భగవంతు నన్వేషించువారము మాత్రమేగాక భగవదైక్యము చెందినవారముకూడా నగుదుము. సత్యమే భగవంతుడు. మనము భగవదన్వేషకులము మాత్రము యగుటచే మన మన్వేషణ క్రియలలోనే నిమగ్నులమైయుందుము. అందువలన మనము లోపములతో కూడినవారమగు నెడల మనము భావించుమతముకూడా లోపభూయిష్ఠమై యుండకతప్పదు.

మనము భగవంతుని సందర్శింప గలిగియుండ లేదుగాన యెట్టిలోకములను లేక మతమును కూడా మనము తెలిసికొన గలిగియుండలేదు. మనము భావించిన మతము లోపభూయిష్ఠమగుటచే దానికి పలువురు పలువిధములగు వ్యాఖ్యానముల

నొనరించుటయును గూడా యెల్లప్పుడును సహజమేయగును. ఇట్టి క్రమాభివృద్ధి కలుగుచుండుటవలననే సర్వమును భగవంతుని సంకీర్తించుట మనకు సాధ్యమగుచుండును. మనుష్యులచే భావింపబడిన మతము లన్నియును లోపభూయిష్టములే యైనచో ఒకమతము మంచిదనియును వేరొకమతము చెడ్డదనియును మతములలో తారతమ్యములను కల్పించుట కెట్టి యవకాశమును కలుగనే కలుగదు. అన్నిమతములును సత్యస్వరూపమును ప్రకటించుటకే ప్రయత్నించునుగాని అన్నియును లోపభూయిష్టములే యగుటచే పొరబడుట అన్నిటికినిగూడ సహజమేయగును. యితరమతములను గూడ మనము గౌరవింపవలెననుట వలన వాటిలోగల లోపములను మనము లెక్కచేయగూడదని యెవరును భావింపగూడదు. కాని మన మతములోగల లోపములనుగూడ మనము సరిగా గ్రహింపవలెను. అటుల గ్రహించి వాటిని తొలగించుటకు ప్రయత్నింపవలెనేగాని మనమతములో లోపములున్నంత మాత్రమున మన మతమును త్యజింపగూడదు. అన్నిమతములను మనము నిష్పాక్షికముగా పరిశీలించుచున్న యెడల యితర మతములలోగల మంచిపద్ధతులను మన మతముల చేర్చుట మన కర్తవ్యమని మనము భావించుటయేగాక వాటిని మనమతములలో చేర్చుటకెంత మాత్రమును వెనుదీయము.

అనేక మతములు కలుగుటకు కారణము:

ప్రపంచమునందు భిన్నమతములు కలుగుట కేమి కారణమను ప్రశ్నకలుగుట సహజము. ప్రపంచములో చాల మతములు

న్నవని మన మెఱుగుదుము. ఆత్మయొక్కటేగాని శరీరముల
సంఖ్యాకములు. అన్ని శరీరములయందు ఈ యాత్మయొక్కటే
చైతన్యమును కలిగించుచున్నది. మనము శరీరములసంఖ్యనుతగ్గిం
పజాలము. కాని, ఆత్మ యొక్కటేయని మనము గ్రహింప
గలుగుదుము. చెట్టునకు ప్రాణము యొకటేయైనను కొమ్మలును
ఆకులును హెచ్చుగానే యుండును. అటులనే మతమనునది
(రిలిజను) యొక్కటే గలదిగాని, దానినిగూర్చిన నమ్మకములు
(ఫెయిత్సు) భిన్నములుగా నుండును. అన్ని నమ్మకములును
దైవదత్తము లేగాని అవి మానవులలో వంశపరంపరగా తరత
రములనుండి ప్రవాహరూపముగా వచ్చుచుండును. కాని మాన
వులయందుగల లోపములు వారి నమ్మకములలోగూడా
సంక్రమించుచుండును. భగవంతుడొసంగిన మతము
వాక్కుల కతీతమైనది. లోపములతోగూడిన మనుష్యులు వాగ
తీతమగు మతమును తమకు చేతనయిన మాటలతో వెల్లడించె
దరు. అట్లు వెల్లడించినవారివలెనే లోపములతోకూడిన మరి
కొందరు మనుష్యులే వీటికి వ్యాఖ్యానములను వ్రాసెదరు.
వీరిలో యెవరిలోపము సరియైనదని మనము నిశ్చయింపదగును?
తన దృక్పథమును బట్టి చూచినచో ప్రతిమనుష్యునకును తనయ
భిప్రాయము సరిగానే కనుపడును. కాని, ప్రతివ్యక్తియును
పొరపడుటకుగూడ నవకాశము లేకపోలేదు. అందువలననే
పరమతసహన మవసర మగుచున్నది. పరమత సహనము గలిగి
యుండవలెననిన తనమతమును నిరాదరింపవలెననుట కాదు.
తన మతమునుగూర్చి యధికమగు విజ్ఞానమును బడసి దానిని నిర్మల

మతితో ప్రేమించవలెనన్నదే యెల్లవారును గ్రహింపదగును.

పరమతసహనము మత పాషండత్వమునకు ప్రత్యక్ష విరుద్ధము. సహనమువలన ఆధ్యాత్మిక విజ్ఞానము కలుగును. మతములనుగూర్చి సరియయిన జ్ఞానముగలిగినచో వివిధమతముల మధ్యమునందు విభేదము లన్నియు నంతరించును. అందువలన సహనము గలుగును. యితరమతములపట్ల మనము సహనము నలవరచుకొనగలిగినచో మనమతమునుగూడ మనము మరింత బాగుగా గ్రహింపగలుగుదుము.

## మంచిచెడ్డలు.

సహనమును కలిగియుండుటవలన మంచిచెడ్డలనుగల విభేదమెంతమాత్రమును తొలగదు. ఇప్పుడు ప్రపంచమునందు ఫెయిత్సు కలవు. వాటినిగూర్చియే యీ వ్యాసమును జేయ ముచ్చటించితిని. వీటికన్నిటికిని మూలాధారములగు సిద్ధాంతములలో నెట్టిభేదమును లేదు. ఇవియన్నియును వెనుక వాటిని కలిగియుండినట్టియు యిపుడు వాటిని కలిగి యున్నట్టియు స్త్రీపురుషులను మాత్రమే సూచించుచుండును. మంచిచెడ్డలనుగూర్చి దుర్మార్గులపట్లను, సన్మార్గులపట్లను, పాపాత్ములపట్లను, పుణ్యాత్ములపట్లనుగూడ మనము దాక్షిణ్యభావముచే కలిగియుండవలెను. గాని దౌరాత్మ్యమును, పాపమును, నిరంతరమును తీవ్రముగా ద్వేషించుచునే యుండవలెను.

# వినయము. 10.

వినయము స్వయంసిద్ధమైన నియమముగాదు. ఇది అహింస యొక్క పరిణామములలో నొకటి; లేక, అందొక భాగమని యైన చెప్పవచ్చును. కాని వినయము అభ్యాసముచే సాధింప దగినదికాదు. వ్యక్తులస్వభావములోనే అదియొక భాగమై యుండవలెను.

సత్యాగ్రహాశ్రమమునకు సంబంధించిన నియమములను, కట్టుబాట్లను తయారుచేసినప్పుడు నామిత్రులగు కీ॥ శే॥ గురుదాస బెనర్జీగారు వానిలో వినయమునకుగూడ ఒకస్థానముండవలయు నని సూచించిరి. ఇప్పుడు నేను చెప్పుచున్నకారణములనుబట్టియే ఆసూచనను అప్పుడు నేనంగీకరింపలేదు. ఇట్లు వినయమనునదియొక విధికాకపోయినను అట్టి విధులన్నిటికన్న గూడ అది ముఖ్యమైనదనియే చెప్పవచ్చును.

(అభ్యాసము)

కాని, అభ్యాసమువలన వినయముగడించుకొన్నవా రెవరును లేరు. సత్యము నభ్యాసముచే సాధింపవచ్చును. అట్లే ప్రేమను గూడ నభ్యాససాధ్యము గావించుకొనవచ్చును. కాని, వినయము నభ్యసించుటయన్నమాత్రము వేషము నభ్యసించుట యేయగును. వినయమనగా ప్రవర్తనయందుగాని, మర్యాదయని గాని భావింపకూడదు. ఒకడొకని హృదయపూర్వకముగ ద్వేషించుచుండవచ్చును. కాని యీద్వేషించుచున్నవాడే, ఒక్కొక్కప్పుడు తన ద్వేషమునకు పాత్రుడైనవానికే సాష్టాంగ

పడి ప్రణమిల్లవచ్చునుగూడ. విన నిది వినయముగాదు; కపటము.

ఒకడు నిరంతర రామనామ పారాయణతో దినమంతయు జపమాల త్రిప్పుచు, ఒక సన్యాసిగతి ప్రవర్తింపవచ్చును కాని, యిట్టివాడే స్వార్థపరుడుగూడ గావచ్చును. ఇట్టివాడు శాంతిస్వభావుడు గాడు. మోసగాడు. వినయశీలుడగువానికి తన వినయమునుగూర్చి తెలియనే తెలియదు. సత్యము మున్నగు వానికి యొకపరిమితి యేర్పరుపవచ్చును. కాని, వినయమునకు మాత్రమట్లు కాదు. సహజసిద్ధమైన వినయము, లోనణగి యుండజాలదు. ఐనను అట్టి వినయముగలవానికిమాత్రము అది యున్నదనియే తెలియదు.

ఈ సందర్భమున వసిష్టవిశ్వామిత్రులకథ చక్కని యుదాహరణము. వినయము. తానొక లెక్కలోనివాడే కాడని ఒక వ్యక్తి భావించుకొనునంతవరకు పోవలయును. అట్లుగాక తానొక సమర్థుడనని యొకడెపుడు భావించుచున్నాడో! అప్పుడే యతడు వినయముతోడి సంబంధమును వదలుకొనుచున్నాడు. తమనియమము లన్నింటిని మూలద్రోసివైచుచున్నాడు.

## అహంకారము.

ఒకడు నియమములను పాలించుచున్నవాడే తన నియమ పాలనమునుగూర్చి గర్వముజెందెనేని, ఆ నియమముల ప్రయోజనమేయంతరించిపోవును. పైపెచ్చు సంఘాభివృద్ధికది యొక్క కంటకముగూడ నగును. సంఘమెా ఆ నియమముల గుణములను గ్రహింపదు. తనకా వానివలని ప్రయోజనము లేకుండబోవును.

వినయము అహంకారమును సంపూర్ణముగా నశింప జేసి వైచును.

జీవజాలమంతయు నీమహా ప్రపంచములో నొక్క యణు మాత్రమే యనుసంగతి నొక్కరవంత యాలోచించినచో స్పష్టపడగలదు. మన జీవితము కేవలము క్షణికమైనది. అనంత కాలచక్రముతో బోల్చి చూచినప్పు డొక్క నూరేండ్లనగా నెంత?

కాని, మనమహంకార శృంఖలములను తెగ్గించి పారవైచి అల్పాల్పులమైనవారము సర్వమును మనమేయగుదుము. మనము గూడ కొంత వాటివారమని భావించుచున్నామన్నచో భగవంతునకును, మనకును నడుమనొక యడ్డుగోడ బెట్టుచున్నామని దానియర్థము. ఇట్టిభావన లేకపోయినప్పుడు భగవదైక్యము గాంచుచున్నామని యర్థము. మహాసముద్రములో జలబిందువు కూడా నొకభాగము కాని, తన భాగస్వామిత్వమునుగూర్చి దానికి తెలియుటమాత్రము తెలియదు.

## స్వాతంత్ర్యము.

కాని సముద్రమునుండి వేరుపడి స్వతంత్రజీవమునకది యారంభింపగనే ఆస్పృకొని పోవుచున్నది. జీవితము కేవలమొక నీటిబుడగయనుట యతిశయోక్తికాజాలదు. ఇట్టియహం అన్యాధారహితమగు వినయము నలవాటు పరచుకొని గడించుకొనజాలము. నియమపాలనమున కావశ్యకమగు నొక స్వాత్వమిది. సత్యాన్వేషణము దహంకారి గాజాలడు. పదార్థములకై యాత్మ

జీవితము నర్పించువానికి స్వీయజీవితమును గూర్చిధ్యానించుకొనుట కవకాశమే యుండదు.

హిందూసంప్రదాయమును అనుసరించిన స్తబ్ధతయే వినయమని భావించుకొనరాదు. మానవకోటిసేవకై నిరంతరములగు ప్రబల ప్రయత్నముల కొనసాగించుటయే వినయము. భగవంతుడు సర్వదా కార్యపరాయణుడు ఒకక్షణము విశ్రాంతి నెరుగడు.

## అశాంతి.

భగవంతుని మనము సేవింపగోరినచో మనముగూడా నెట్టి యలసట నెరుగని కార్యపరాయణులము గావలసియుండును. సముద్రమునుండి బయటబడిన నీటిచుక్కకు విశ్రాంతియుండవచ్చును. కాని, సముద్రములోనే యున్న జలబిందువునకు మాత్రము శాంతిలేదు. ఏలయన? అసలు సముద్రమునకే శాంతిలేదు. మనస్థితిగూడా నట్టిదే? భగవంతునితో నైక్యము సంపాదించుకొన్ననాడు మనకింక శాంతి కవకాశము లేదు. ఇంక దాని యవసరముకూడ మనకుండదు.

అశాంతిలోనే శాంతి యిమిడిపోయియున్నది. ఈ యనంతమగు శాంతిమీదనే అనిర్వచనీయమగు శాంతి ఆధారపడియున్నది. అందుచే వాస్తవమగు వినయము మానవసేవకై వ్యక్తి సర్వార్థత్యాగమును కాంక్షించుచున్నది. ఇట్టి సర్వపరిత్యాగము నదుగల యౌన్నత్యమును వర్ణించుట దుస్సాధ్యముగాని, యది యనుభవదూరముమాత్రముగాదు. సర్వసమర్పణము గావించు

కొన్ని దినములలో వారు ఆస్థితిని పొందగలిగిరి. మనకుగూడా నిది సాధ్యమేయగును.

సత్యాగ్రహాశ్రమము యొక్క పరమావధియే మాకార్యములు, మానియమములు మన్నించుటకు చేయుట నిర్దేశింపబడినవి. నిరంతరముగా నుత్తమకార్యములలో నిమగ్నులమై యున్నచో నెప్పుడో యొకప్పుడు యెవ్వరికి నెరుకపడకయే మేమాపరమావధి జేరఁగొందుము; కాని, ప్రత్యక్షముగ మేము దానిని వెంటాడించినమాత్రము ఈ పరుగునుదప్పించుకొని పోవుట దానికి సహజము.

---

## ప్రమాణము. 11.

ఈ లేఖలలో నేను ప్రమాణమునకుగల ప్రాముఖ్యమును గూర్చి క్లుప్తముగా చర్చించియున్నాను. కాని పవిత్రమగు జీవితమునకును ప్రమాణము లెంత యావశ్యకమో! వివరించుట యవసరము. "మనము కొన్ని నియమముల ననుసరించి ప్రవర్తించుట యవసరమే! కాని అందుకై ప్రమాణము గైకొనుటమాత్రము యవసరము కాదను వారు చాలమంది కలరు. ఇంతే కాదు. ప్రమాణమనునది దౌర్బల్యసూచన అనియు అది యొకప్పుడు హానికరముకూడ నగుననియు వారి యభిప్రాయము- "ఒకనియమమునకు కట్టుబడియుండునట్లు మనము ప్రమాణము గయికొనవచ్చును, కాని, కొంతకాలము తర్వాత అది మనక

సౌకర్యముగ తోచవచ్చును, లేదా? ఒకపాపముగ తోచ వచ్చును. ఇట్టి సందర్భములలో పయి ప్రమాణమునకు కట్టుబడి యుండుట కేవలము హానికరము. కల్లు త్రాగకుండుట మం చిదే కాని వైద్యమునకు కావలసిన యవసరమును బట్టి కల్లు త్రాగవలసి వచ్చునని కొందము, అయినచో అప్పుడప్పుడు దా నిని త్రాగినందువలన తప్పేమి? పూర్తిగా నిషేధించినయే వైద్య దమను ప్రమాణము యొక్క యావసరమైన యిబ్బంది. ఈ యి బ్బంది కల్లువిషయమైన నెట్లో తక్కిన యవసరములలోగూడ నట్లే" అని వారివాదము.

## ప్రమాణమనగా నిశ్చయబుద్ధి.

ఈవాదములు సరియయినవని నేను భావింపను. ప్రమా ణమనగా వెనుకంజ యిడని నిశ్చయబుద్ధి, అన్ని యిబ్బందుల బారినుండియు మానవుని హృదయమును రక్షించుటకే యిది యవసరము, అసౌకర్యము కలిగినంతమాత్రమున ఒకనిశ్చయ మును వదలుకోవలసి వచ్చినచో ఇంక నట్టి నిశ్చయమునకు ప్రయోజనమేమి? దృఢమగు నిశ్చయమొకటి లేకపోయినచో అభివృద్ధి కనకాశమే యుండదని ప్రపంచానుభవము దెలుపు చున్నది, పాపకార్యము చేయుటకు ప్రమాణముండదు. ఒక విషయమున ప్రమాణము గయికొనిన తర్వాత కొంతకాలమున కది పాపదాయకమని తెలిసినచో అప్పుడా ప్రమాణమును వదలుకొనవలసిన యవసరము తప్పక కలుగును, కాని యిట్టి యంశములలో యెవరును ప్రమాణము గయికొనవలసిన యావస

కమే లేదు. సర్వసాధారణముగ మనమలవాటు పడచుకొనవలసిన మనధర్మములనుగూర్చి యే ప్రమాణములనుగయికొనవలసివచ్చును. ఇట్టి విషయములలో పాపము గలుగవచ్చునని భావించుకొనుట కేవలము వాదుకమాత్రమే యగును—సత్యవాదియగువాను నిజము చెప్పుటవల్ల ఎదుటివారికెవరికైన హానికలుగునేమో యనుభయము చెందనక్కరలేదు ఏలనన నిజము జెప్పుటయెప్పటికిని నిరపాయమే యను పూర్తినమ్మకము వానికి కలదు. అట్లే సంపూర్ణనిషేధము కూడ నిషేధవాది పుట్టుమొదటనే మందువిషయమై నిషేధముండకూడదని నిశ్చయించుకొనును. లేదా! తనప్రమాణమును నిలుపుకొనుటకై ప్రాణములనైనా నర్పించుటకు సిద్ధముగ నుండును. సంపూర్ణనిషేధము నవలంబించి యొకడు ప్రమాణము కొల్పోయెననియే యనుకొందము, అయిన దీనివలన నష్టమేమి? కల్లు తప్పక ప్రాణమును నిలుపగలదను నిశ్చయము లేదు. ఒకవేళ కొంతకాల మట్లది నిలిపియుంచ గలిగినను మరియే కారణముచేతనైనను మరుక్షణమందె ఆప్రాణము తరిగిపవచ్చును; అట్లు కాక తన ప్రమాణమును వదలుకొనుటకన్న ప్రాణమువదలుకొనుటయే మంచిదని యొకడట్లు చేసెనన్నచో! అది త్రాగుబోతుల తత్వమును మార్చుట కద్భుతముగ నుపయోగించగలదు. ప్రపంచ సౌఖ్యమునకదియొక మహాశక్తి కాగలదు. జీవనావస్థయందును మరణావస్థయందునుగూడ తమ విశ్వాసమునకు కట్టుబడి యుండగలవారెవరో వారు భగవంతుని జూడగలుగుదురు.

## ప్రమాణము దౌర్బల్యసూచకముగాదు.

ప్రమాణము గైకొనుట బలహీనతను సూచనగాదు. బలవత్త్వముననేసూచన. తాను నిర్వహింపవలసినవిధిని ఎట్టియవస్థయందైననుసరే నిర్వహించి తీరవలయుననుటయే ప్రమాణమున కర్థము. దీనికెవరి యిష్టమువచ్చినట్లు వారు పేరు పెట్టుకొనవచ్చును. పూర్తిగ నిది బలవంతుల లక్షణము.

## సాధ్యమైనంతవరకు.

ఏదైన నొకపని చేయవలసి వచ్చినప్పుడు "సాధ్యమైనంతవరకు చేసెదన"ని చెప్పువాడు గరువపోతైన గావలయును. లేదా! బలహీనుడైన గావలయును. ఇట్లనుటచే, తాను వినయమూగానున్నట్లతడు నటింపవచ్చును. కాని నిజమునకిది మరియేమైన గావలయును, కాని వినయము మాత్రముకాదు. నా విషయమునను యితరుల విషయమునను గూడ నేనీ యంశమును గమనించి చూచితిని. ఈ, సాధ్యమైనంతవరకు, అను పరిమితి సత్సంకల్పములనన్నిటిని ధ్వంసమొనర్చి తీరును. "సాధ్యమైనంతవరకు ఒకకార్యమును నిర్వహించుచున్నామన్నచో మొట్టమొదట యాకర్షణకే మనము లొంగిపోవుచున్నామన్నమాట సాధ్యమైనంతవరకు సత్యమార్గము నవలంబించ వచ్చుననునది అర్థములేనిమాట. ఒక ఋణపత్రములో ఫలానతేదీనాడు సాధ్యమైనంతవరకు కొంతమొత్తమును చెల్లించెదనని వ్రాసియిచ్చిన చో సాహుకారు దానికెన్నడును అంగీకరించడు. ఇట్టిదేభగవంతునకు మానవుని ఋణపత్రముసైతము "సాధ్యమైనంతవరకు సత్యమార్గము మనమవలంబింతుమని మనమన్నచో దానికతడు

ను యొప్పుకొనడు. ప్రపంచమంతయు ప్రమాణముమీదనే ఆధారపడియున్నది. ప్రమాణమే భగవంతుడు తన విధులనుండి యొకవెంట్రుకవాసి తప్పినను భగవంతుడు భగవంతుడుకాడు. ఇట్టిప్రమాణములను అచంచలముగ నిర్వహించువారిలో సూర్యుడొకడు. అందుచేత నేసూర్యునిబట్టి కాలనిర్ణయము గావించుటకు, పరిమితి నేర్పరచుటకు అవకాశము లభించుచున్నది. విధినిర్వహణ విషయమున సూర్యునపసాటి మరియొకటిలేదు. కాబట్టియే యతనిరక్షణమున మనము మన కెట్టిఅపాయము లేదనిభావించుకొన గలుగుచున్నాము. మానవునిప్రమాణబుద్ధిమీదనే వ్యవహారమంతయు ఆధారపడియున్నది. అందుచే ప్రమాణమనునది యెచ్చటతలచిన నచ్చటనేయున్నదనుట స్పష్టము. ఇట్టిచో ఆత్మజ్ఞానము సార్జించుకొనుటలోగాని, స్వభావసాష్టవము నలవరచుకొనుటలోగాని, అదిలేకమనము సాధింపగలదేమియు లేదు. అందుచే ప్రమాణము లత్యంతావశ్యకములను సంగతిని గూర్చి మనమెన్నడును సందేహింప కుందుముగాక.

---

## 'యజ్ఞము' అనగానేమి? 12

మనము 'యజ్ఞము' అను పదమును తలుచుగా వాడుచుందుము. తుదకు నూలువడుకుటనుగూడ దిన దినమును నిర్వహింపవలసిన యొక మహాయజ్ఞముగా నేర్పరచుకున్నాము. అందుచే యజ్ఞము అను పదములో నిమిడియున్న ఆయాభావములనుగూర్చి యెరిగికొనుటవసరము.

భౌతికాధ్యాత్మికములగు నెట్టి ప్రతిఫలములమీదను ఆశ పెట్టుకొనక లోక కల్యాణమునకై మనము చేయు కర్మయే యజ్ఞము ఇచ్చట కర్మఫలమున విశాలాతి విశాలమగు భావమున్నది. మనోవాక్కర్మలు మూడును కలసియున్నవి. కర్మలో! లోకకల్యాణమున కన్నప్పుడు లోకశబ్దమున కర్థము. మానవకోటి యనియే కాదు జీవజాలమంతయునని యర్థము. అందుచే అహింసాసిద్ధాంతమునుబట్టి చూచినప్పుడు మానవకోటి కల్యాణమును సాధించుటకేయైనను పశుబలి నిచ్చుట యజ్ఞము కాజాలదు.

## వేదప్రామాణ్యము.

వేదములు యజ్ఞమునందు పశుబలి నంగీకరించుచున్నవందురు. ఈవాదము నాకవసరములేదు. అహింసా సత్యసిద్ధాంతములనుబట్టి పరీక్షించినప్పుడీ బలి అట్టి పరీక్ష కాగజాలదన్న చాలును. మతధర్మములను పేరున వేదకాలములో ఏయే ఆచారము లాచరణమువచ్చినను సంగతి నాకవసరములేదు. వేదశాస్త్ర పాండిత్యము నాకులేదను విషయమునే నెప్పటికప్పుడే యంగీకరించెదను. ఈలోపములను దిద్దుకొనుటకు ప్రయత్నముకూడ అనవసరమే! ఒకవేళ చరిత్రకారులు వేదకాలమున పశుబలి ఆచరణలో నుండెడిదని నిర్ధారింపగలుగుదురే యనుకొందము. అప్పుడుగూడ సత్యాదర్శమును ప్రేమసిద్ధాంతమును మనమను సరింపవలసియున్నప్పుడు ఈపశుబలి సిద్ధాంతమును నిరసింపక తప్పదు.

## మహాయజ్ఞము.

దీనినిబట్టి 'మహాయజ్ఞ' మను పదమునకుగల భావమును మనము తెలిసికొనవచ్చును. సాధ్యమైనంత యెక్కువమంది సాధ్యమయినంత సులభముగా సాధ్యమైనంత యెక్కువజీవుల క్షేమముగోరి చేయుపని యేదో అదియే మహాయజ్ఞము. అందుచే యేదోయొక ప్రయోజనమును మనసులో నుంచుకొని అందుకై మరియొకరి కెవ్వరికిగాని యశుభము గోరుట యజ్ఞముకాజాలదు. భగవద్గీతకూడా యజ్ఞమని చెప్పుటకు వీలులేని కర్మయంతయు బానిసతనముక్రిందికే వచ్చునని నుడువుచున్నది. మన యనుభవముకూడదీనినిధృడపరచుచున్నది

## గీతయజ్ఞము.

యజ్ఞమున కిదియే యర్థమైనప్పుడు యజ్ఞములేక ప్రపంచప్రవృత్తియే యసాధ్యము. అందుచే రెండవ యధ్యాయములో జ్ఞానమునుగూర్చి చెప్పినతరువాత అట్టి జ్ఞానము నార్జించుదారి యేదియని మూడవయధ్యాయములో చర్చించబడినది. ఈ సందర్భమున భగవద్గీత మనము పుట్టిననాటనుండియు యజ్ఞము మనల నంటిపెట్టుకొనియే యున్నదని నుడువుచున్నది. ఇతరులకు మనము సేవచేయుట కొరకు సాధనముగ నుండుటకు మాత్రమే మనకీ శరీర మీయబడినదని దీనియర్థము. కాబట్టియే! యజ్ఞముగావింపక ముందే భుజించువాడు దొంగిలి తినుచున్నాడు, అని గీత శాసించుచున్నది.పవిత్రమగు జీవితము గడుపువారొనరించు ప్రతికార్యమును యజ్ఞమేయగును.

## భగవంతుని బానిసలు మానవులు.

ఇట్లు యజ్ఞము మనతో బాటు బుట్టినదగుటచే బ్రతికియు న్నంతకాలము మన మవ్విధి నివారమేయగుదుము. బ్రతికి యున్నంతకాలము ప్రపంచ సేవగావించుట మన విధియగును. బానిసలు తన యజమాను లిచ్చు యన్నవస్త్రములతో కాలక్షేపము చేయువిధముగనే మనముగూడ కృతజ్ఞులమై ఆవిశ్వేశ్వరుడిచ్చుదానిని గ్రహింప వలయును. అదియైనను మన హక్కులవ ఫలితమని మనమను కొనరాదు. అందుచే మనకది లభింపకయే పోయినను మనయజ మానుని మనము నిందింపకూడదు. ఈ శరీర మతనిది. దీనిని పోషించుటగాని, యావల పారవేయుటగాని యాతనియిష్టము. దీనినిగూర్చి మనము విచారింపవలసిన యక్కరలేదు. జాలిపడ దగినదియు గాదిది. అట్లు కాకపోవుటయేగాక, యిది యొక సహజమైన స్థితి. అందుచే సంతసింపదగినది. కోరుకొనదగినది భగవత్సృష్టిలో మనకు తగిన స్థానమేదియను నంశమును మనము దవ్వంత తెలిసికొన్నచో నది స్పష్టము. బలీయమగు విశ్వాసము గలవాడే యీ మహానంద మనుభవింపగలుగును. "నిన్నుగూర్చి నీవాలోచించుకొనవలసిన యవసరము రవ్వంతయైనను అదియం తయు ఈశ్వరునికే విడిచిపెట్టుము" అనియే యన్నిమతములును శాసించుచున్నట్లు తోచును.

## స్వార్థత్యాగము.

కాని దీనికెవ్వరును భయపడవలసిన యవసరము లేదు. నిష్క లుషమగు హృదయముతో యితరులకు సేవజేయువాడు, అట్టి

సేవనుగల యవసరముగూర్చి మరింత యెక్కువగా తెలిసికొన గలడు, అతని విశ్వాసము నిరంతరముగ యెక్కువ యగుచునే యుండును. తనజన్మ యెట్టిదో గుర్తెరుగజాలనివాడు, స్వప్రయోజనము విడచిపెట్టుకొనుటకు సిద్ధపడలేనివాడు సేవయొనరింపజాలడు. ఒకవేళ యతడెట్టిసేవను దిగినను స్వార్థపరత్వము దాని నంటుకొనియే యుండును. కానియింత కఠినులగు స్వార్థపరులు మిక్కిలి యరుదు. తెలిసియో, తెలియకయో మన మందరమును యేదో యొక స్వార్థరహితమగు సేవ యొనరించుచునే యుందుము. ఇట్టి సేవాధర్మములను బుద్ధిపూర్వకముగనే నిర్వర్తించుట మనమభ్యసించిననాడు సేవ యొనరింపవలయునను మనయాశ రోజురోజు యెక్కువగుచుండును. మనయానందమునకేకాక నిఖిలప్రపంచ కల్యాణమునకు గూడ నది సాధనమగును. 2

గతవారము యజ్ఞమునుగూర్చి వ్రాసియుంటిని. ఆవిషయమై కొంత వ్రాయవలయునని నాకు సంకల్పము కలుగుచున్నది. మానవకోటి యుద్భవించిననాడె యావిర్భవించిన యిట్టియుత్కృష్ట ధర్మమునుగూర్చి యోచనచేయుట సత్కాలక్షేపముగా నుండగలదు.

యజ్ఞమనగా మానవుడు దినమంతయు గం 24 లు కాలమును నిర్వర్తింపవలసిన ధర్మమైయున్నది. కనుక "పరోపకారాయ సతాంవిభూతయః" (ఇతరుల కుపకరించుటకొరకై సజ్జనులు తమ సకలసంపదలను వినియోగపరచెదరు.) అనెడి ధర్మసూత్రము అసంకోచముగా కల్పింపక మానదు. నిష్కామ

ముగా యితరుల సేవ చేయుట యనగా! యితరులకు మేలు చేయుట కాదు. ఆ మేలు మనకే చెందు చున్నది. మన మితరులకు చెల్లింపవలసిన ఋణమును చెల్లించుట వలన మన ఋణభారమును మనమే తగ్గించు కొనుచున్నాము. ఆరీతిగా మనధర్మమును మనము నిర్వర్తించుచున్నాము. సత్పురుషులు మాత్రమేగాక మానవులందరును తమ సకలార్థములను మానవకోటి వినియోగార్థమై సమర్పింపవలసియున్నారు. కాబట్టి యిట్టిసందర్భములో స్వసౌఖ్యవిలోలత్వము యంతరించి ఆత్మత్యాగమునకు తావొసంగుచుండును. ఆత్మత్యాగమే యొకవిధమగు విలోలత్వముగా పరిణమించును.

## త్యాగము.

మానవునకుస్వార్థ త్యాగమనెడి గుణము కలదు. ఇదియే మానవునకును, మృగమునకును గల భేదము. మానవు లందరును సర్వసంగపరిత్యాగులైన యెడల అలంకారమునకు గాని, శృంగారమునకుగాని మానవజీవితములో తావుండదని కొందరు వాదించెదరు. గృహస్థజీవితమున కవకాశముండదని యు వాదించెదరు. కాని వీరికి త్యాగభావము పూర్తిగా బోధపడలేదు. త్యాగమనగా వ్యవహారప్రపంచమును వీడి యరణ్యభూములనివసించుట గాదు. త్యాగబుద్ధి మనజీవితవ్యాపారములన్నింటియందును జీర్ణమై అంతర్గతముగానుండిప్రతిఫలించవలెను.

గృహస్థుడు అయినవాడు విషయలోలుడు కావచ్చును. లేదా పరిత్యాగి కావచ్చును. వర్తకుడు కోట్లకొలది ధనముతో

వ్యాపారము చేయుచుండ వచ్చును. కాని త్యాగబుద్ధితో యతనియందుకూడ వర్తించ వచ్చును. అట్టి త్యాగబుద్ధితో యతడు వ్యాపారము చేయుచున్న యెడల పరోపకారార్థమై నిరంతరము యతనిబుద్ధి పనిచేయుచుండును. అట్టివర్తకుడు మోసము చేయడు. పరాశాపరుడై వ్యాపారము చేయడు. నిరాడంబర జీవితము గడపును. ఒకనికి హానిచేయుటకన్న తన కోట్లకొలది ద్రవ్యమునే కోల్పోవజాలును.

ఇటువంటి వర్తకుడు ఈ పృథివిలో యుండ నేర డనియు, ఊహా కల్పితరూపమనియు భావింప జనదు. అట్టి వర్తకశ్రేష్ఠులు పాశ్చాత్య దేశములందును, ప్రాచ్యదేశము లందును మన యదృష్టవశమున జీవించియున్నారు. అట్టి మహా నీయులగు వణిక్పుంగవులు యత్యల్పసంఖ్యాకులుగా కన్పించ వచ్చును. కాని, అట్టివాడొక్కడున్నప్పటికినిగూడ యిట్టి సిద్ధాంతము సాధ్యమే యనియు, కపోలకల్పితమైన యసంభవ విషయము గాదనియు రుజువగు చున్నది. వఖ్యానులో పరోప కారపారీణుడైన కుట్టుపనివా డొకడు గలడు. ఇటువంటి మంగలవానినికూడ నే నెరుగుదును. ఇట్టిత్యాగరూపియైన సాలె వానిని మనమందరము నెరుగుదుము.

ఈవిషయమై దీర్ఘపరిశోధన చేసినయెడల అన్నివృత్తు లయందును త్యాగశీలురు మనకు గాన్పించగలరు. ఈ త్యాగ శీలురు తమ కష్టార్జితమువల్లనే జీవించుచున్నారుగాని, తమ జీవనోపాధియే వారియొక్క ప్రధానలక్ష్యముకాదు. వీరివృత్తి వ్యాపారసందర్భములో జీవనోపాధియనునది యుపాంగము

గానున్నది. మోతీలాలు మొట్టమొదట మట్టుపనివాడుగానుండెను. తరువాతకూడ మట్టుపనివాడుగా నుండెను. గాని, తరువాత అతనియొక్క తత్వముమారిపోయెను. అతడు యితరుల క్షేమము నే సదాకోరుచుండెను. అందువల్ల అతనిజీవితము నిజముగా రమ్యమై, శృంగారమయమై శోభిల్లుచుండెను. త్యాగపరిపూర్ణమైన జీవితమే! కళాలంకార భూయిష్టమై రమణీయతకుశిరోభూషణమై యొప్పును. అను క్షణమును నూతన శోభతో పరిఢవిల్లును. అందువల్ల జీవితము రసవంతమైయుండును. అట్టి సారస్యమునకు మితిమీరుటయనునదియుండదు. ఈ జీవితము యక్షయతూణీరమువలె నిరంతర శోభాప్రపూర్ణమైయుండును. ఆత్మయజ్ఞమును చేయుట భారమైన కార్యమని భావించిన యెడల అదిసార్థకమైన యజ్ఞముకాజాలదు. విషయ లోలత్వము ఆత్మవినాశమునకు దారిచూపును. ఆత్మత్యాగము నిత్యమైన యమరత్వమును చేకూర్చును. మన జీవితాభిరుచి మన చిత్తవృత్తినిబట్టి యుండునేకాని యచంచలమైన పరమధర్మముగాదు. ఒకనికి నాటకములయందు యభిరుచియుండును. ఇంకొకనికి యాకసమునందలి జ్యోతిర్మండల పరిణామములను విమర్శించుటయందు మతూహల మెక్కువయుండును. కాబట్టి జీవితాభిరుచియనునది వ్యక్తిగతమైన విశిష్టలక్షణము. జాతీయ సంప్రదాయసిద్ధము. మనబాల్యమందు మనకు బోధింపబడిన విషయములందే మనకభిరుచి యేర్పడుచుండును. ఒకజాతికి మనోజ్ఞమైన విషయములు యింకొక జాతికి యేహ్యమైనవిగా కన్పించుననుటకు యనేక తార్కాణములు పేర్కొనవచ్చును

## అధికారహంకారము భృత్యభావము

నిర్వ్యాజమైన ప్రజాసేవ తాము చేయుచున్నందున ప్రజలు తమకు కావలసిన వస్తుసామగ్రి యంతయు సమర్పింపవలసినదనియు, తమకు నిజముగా యక్కరలేని వస్తువులనుకూడ తాము స్వీకరించుటకు యర్హులమనియు కొందరు ప్రజాసేవకులు భావించుచున్నారు, ఇట్టిభావముతో వర్తించువారలు సేవకులు కాజాలరు. వారు ప్రజాపీడనముచేయు అధికారాహంకారులు. మానవసేవచేయ సంకల్పించినట్టి వాడు. ఒకడైనను తన సౌకర్యసౌఖ్యముల గూర్చి తలపోయడు. తన జీవిత సౌకర్యముల నొనగూర్చుటకుగాని, నిరాకరించుటకుగాని, సర్వశక్తిసంపన్నుడైన ఆ జగన్నాథుడే కర్తయని త్యాగికల పోయును. కాబట్టి తనకు లభించిన దంతయు సేకరించుకొనుచు తన జంబాలపటలమును వృద్ధిచేసికొనడు. తన కత్యంతావసరమైన పదార్థములనే స్వీకరించి జీవితము గడపుచు మిగిలినవి వర్జించును. అట్టివాడు క్రోధమువీడి శాంతచిత్తుడైయచంచలహృదయుడై కష్టముల సహించును. పుణ్యకార్యములకు ప్రతిఫలము పుణ్యామే యనునట్లుగా త్యాగిచేసెడి పరోపకారమునకు పరశ్రేయమే ప్రతిఫలమై యొప్పును.

## సత్వర కార్యాచరణ

పరోపకారములందు యిష్టానుసారముగా నిర్లక్ష్యముగా ప్రవర్తించుటకు వీలులేదు. స్వకీయవ్యవహారములయందు శ్రద్ధాసక్తులు పూర్తిగాయుండవలెననియు ప్రజాసేవమాత్రము యథే

చ్ఛముగా తీరిక కలిగినపుడు చేయవచ్చునని యు కొందరు భ్రమించు చున్నారు. అట్టివారు ఆత్మత్యాగ మనెడి విద్య యందు యింకను ఓనమాలు నేర్చుకొనవలసి యున్నారు. మనము యథేచ్ఛగా చేయనిశ్చయించిన పరోపకారములగు పుణ్యకార్యములయందే మన యుత్తమశక్తి సామగ్ర్యములను వినియోగించ వలెను. మన స్వంతపనులనుకూడ విడనాడి పర హితార్థమునే ఘటించవలెను. విశుద్ధత్యాగి లోకసంగ్రహ కార్థమై ముందు వెనుకల నరయక తన సర్వస్వమును సమర్పించును.

---

## 13. భగవద్గీతా ప్రాశస్త్యము.

ఇంతదనుక ఆశ్రమవాసులు గైకొను ప్రమాణములనుగూర్చి వివరించితిని. త్యాగధర్మమునుగూర్చియు, ప్రమాణములను గైకొను ఆవశ్యకతనుగూర్చియు కూడ వివరించియుంటిని. ఇప్పుడు యేగ్రంథమును మనము ప్రతిరోజుపఠించి, పక్షమురోజులలో పూర్తిచేయుదుమో, ఏగ్రంథతాత్పర్యమును నిరంతరము మనము మననము చేయుచుంటిమో, ఏమహాగ్రంథమును ఆధ్యాత్మికవిద్యాభిధానమని మనము భావించుచుందుమో అట్టిభగవద్గీతనుగూర్చి ముచ్చటించెదను. ఏగ్రంథము మన ప్రతియడుగున ఉపయోగింప దలచుచుందుమో, ఏగ్రంథసహాయముచే నిగూఢములును, అగాధములును నగు మానవప్రవృత్తుల నవగాహనము చేసికొననెంతుమో, ఆగ్రంథమునుసమగ్రముగా దెలిసికొని

నిరంతరము పఠనము చేసికొనదలచుచుచో, ఆగ్రంథములో మనము విక్యము చెందవలెను. కష్టములలో నున్నప్పుడెల్ల మాతృస్వరూపిణియగు భగవద్గీతను చదువుకొనుచుందును. ఆమహాతల్లియు నాకష్టముల పారద్రోలి చిత్తశాంతి నొసగుచుండును. ఆగ్రంథము నేనెట్లు అవగాహనము చేసికొనుచున్నానో తెలిసికొనుడో భగవద్గీతను పఠించినదానివలన దుఃఖశాంతి నిబొందు మహాశయులు యింకను క్రొత్తసంగతులను నేర్చుకొనగలుగుదురు. ఆగ్రంథమువలన యింకను సహాయమును బొందగలుగుదురు.

## భక్తియోగము.

ఈరోజున 12వ అధ్యాయముయొక్క సంగ్రహము నిత్తును. ఈఅధ్యాయమునందు భక్తియోగమును గూర్చి, అనగా ప్రేమద్వారా భగవత్సాక్షాత్కారమును బడయుటను గూర్చి వివరింపబడియున్నది. వివాహసమయమున యీఅధ్యాయమును వల్లెవేసి తాము చేయవలసిన పంచయజ్ఞములలో నొక్కదానిని భావింపుడని సతీపతులకు మనముబోధించుచున్నాము. భక్తిలేని కర్మకాండయు, జ్ఞానకాండయు నిరర్థకములు. అవిమనుజునికి భారముగాకూడ నుండవచ్చును. కావున ప్రేమపూరితమనస్కులమై యీగ్రంథమననమునకు గడంగుదము.

## సాకార నిరాకార పరమాత్మస్వరూప చింతనము.

అర్జునుడు కృష్ణపరమాత్మ నిట్లడుగుచున్నాడు:— సాకారుడవగునిన్ను శ్రద్ధాభక్తులతోభజించు భక్తులు ఉత్తములా? లేక,

అవ్యక్తుడవునా, అక్షరుడవును నగునిన్ను భజించుయోగులు ఉత్తములా (12-వ అధ్యాయమును 1వ. శ్లోకము) ఈప్రశ్నకు శ్రీకృష్ణభగవానుడిట్లు ప్రత్యుత్తర మొసంగుచున్నాడు:—

ఎవరు నాయందు అనగా సాకారపరబ్రహ్మమునందు మనస్సు నిలిపి శ్రద్ధతో, భక్తిభావముతో నన్నుపాసించు చున్నారో వారు నాకు సమ్మతులు. (12అ-2శ్లో.) మరియు ఎవరు యింద్రియ గ్రామమును బాగుగా నియమించి సర్వత్రసమబుద్ధి గలవారై అక్షరమును, అవ్యక్తమును, అనిర్దేశ్యమును, అచలమునగు పరమాత్మను, భజించుచున్నారో వారుగూడ నన్నే పొందుచున్నారు. (12అ-3, 4 శ్లో.)

కావున యీరెండుపద్ధతులలోను ఒకటి యెక్కువనియు ఒకటితక్కువనియు, చెప్పవీలులేదు. కాని దేహధారులు అవ్యక్తమును అచింత్యమును నగుదానిని గ్రహించి, దానిపై భక్తినిలిపి భగవత్సాక్షాత్కారము పొందుట దుర్లభము. పరమాత్మ గుణాతీతుడును మానవచక్షువుల కగమ్యగోచరుడునై యున్నాడు. అట్టివస్తువుపైభక్తి నిలుపుటచాలకష్టము. కావున తెలిసియో, తెలియకయో, దేహధారులందరు భగవంతుని సాకారరూపమునే చింతనముచేయుదురు.

---

# 14. మోక్షమిచ్చు రాముడు.

మనమేరాముని గుణగానము చేయవలసియున్నదో, ఆ రాముడు వాల్మీకియొక్క రాముడుకాడు. తులసీదాసు రామా

యణములోని రాముడుకాడు. తులసీదాసు రామాయణము నాకత్యంత ప్రియమగు గ్రంథము. నేను దానిని అద్వితీయ గ్రంథమని తలచెదను. మరిఒకపర్యాయము చదువ ప్రారంభించిన విసుగుజెందను. అయినప్పటికిని నేడు మనము తులసీదాసుయొక్క రాముని స్మరించువారము గాము. గిరిధర రామునిని భజించుటలేదు. అట్టియెడ కాలిదాస భవభూతుల యొక్క రాములగురించి ప్రశ్నించనేల?—భవభూతి రచించిన ఉత్తరరామాయణమునందు సౌందర్యమున్నది; కాని, యెవని నామము స్మరించిన మనము భవసాగరమును తరించగలమో, దుఃఖసమయములో నెవని నామము స్మరించవలయునో, అట్టి రాముడు దానిలోలేడు. సహించరాని వేదనతో దుఃఖించుచున్న మనుష్యునకు 'రామ నామము స్మరించు,' డని నేనుపదేశించుచుందును. నిద్రరాకపోయినను రామ నామము జపింపు(డని బోధించుచుందును. అయితే రాముడు (నేచెప్పు రాము ఁ) దశరథపుత్రుడును, సీతాపతియునగురాముడుకాడు.

ఈ రాముడు దేహధారిరాముడే కాడు. మన హృదయకమలమందు వసించురాముడు. దేహధారి కానేకాజాలడు. మది హృదయమో అంగుళపరిమాణము గలిగినది. చాలచిన్నది. దానిలో వసించురాముడు దేహధారి యెట్లు కాగలడు? అతడు యేదోయొక చైత్రశుద్ధనవమినాడే జన్మించియుండడు. అతడు జన్మరహితుడు. ప్రపంచమునంతటిని సృష్టించినవాడు. సృష్టికర్త, జగత్పతి, కనుక, మనమేరాముని స్మరింపదలచుచున్నామో, యేరాముని స్మరింపవలయునో, ఆరాముడు మనకల్పిత

రాముడే! యితరులు కల్పించిన రాముడుకాడు.

ఈ సూత్రము జ్ఞాపకముంచుకొన్న మన మనస్సునందుదయించు అనేకశంకలిక కలుగజాలవు. వాలిని వధించిన రాముడు పూర్ణ పురుషోత్తముడెట్లగునని అనేకపర్యాయములు శంక పొడమును. నాదగ్గరకుకూడ యిటువంటి ప్రశ్నలనేకములు వచ్చుచుండును. నేను మనస్సులో నవ్వుకొందును. ఎవడైన మోసముతోగాని, లేక, బహిరంగముగాగాని, యెదుర్కొని యెవరనైన చంపిననుగాని, లేక, పదితలలుగల దేహధారియగు రావణుడుండిన వానిని చంపినను అదెంతటి ఘనకార్యము? ఈ కాలమున నిరువదేమి! యసంఖ్యభుజములుగల రావణుడు పుట్టినను, ఒకబాలుడొక్క ఫిరంగిగుండుదెబ్బతో అతని యసంఖ్య భుజములను, తలనుకొట్టివేయును. అట్టివానిని మనము అలౌకిక బాలుడుగా పరిగణించము. అతడొకరాక్షసుడనియే తలచెదము. మనము రాక్షసుని పెద్దన్నవలె శక్తిని సంపాదింప కోరుట లేదని నేను తలచుచున్నాను. అట్టివానిని పూజించుటవలన మనకు శాంతికలుగదు. మనము, అంతర్యామిని, అందరిలోపల నుండువాడును, బయటనుండువాడును, అందరకు స్వామియగు వానిని పూజింపవలయును. అతనిగురించియే మనము 'నిర్బలకే బలరామ్' నిర్బలులకు రాముడే బలమని గానముచేసితిమి. ఇక్కడ 'ద్రౌపది నిర్బలురా' లయినదను విషయమున్నది. ఇప్పుడు ద్రౌపదికి దేహధారియగు రామునకు సమన్వయమెట్లు కుదురును? అయినప్పటికిని కవి ద్రౌపదిమానమును రాముడు కాపాడినాడని గానముచేసినాడు. ఇందులోని రాముడు అం

దరవ సామాన్యుడే! అయినను యెవరును అతని తెలిసికొన జాలరు. మనమారామునే స్మరించుచున్నాము. అంతర్యాము లగు రామకృష్ణులయందు భేదమేమియు లేదు.

ఈపండుగనాడు నిగ్రహమును కలిగియుండుట యను బాలురు నిర్దోషమగు ఆనందముపొందుటయను రామాయణముచదివి జ్ఞానము సంపాదించుటయను ఈ శ్రీరామనవమీ మహోత్సవము జరుపబడుచున్నది. దేహధారియగు మనుష్యుడు పరమేశ్వరుని పరోక్షవిధమున త్వరగా తెలిసికొనజాలడు. మానవుని కల్పనాశక్తి చాలదూరముపోజాలదు. కనుక పరమేశ్వరుడు మనుష్యరూపమున యవతరించెనని తలచును. హిందూ మతములో ఔదార్యమునకు మేర లేదు. కనుకనే! పరమేశ్వరుడు చేపరూపముగను, పందిరూపముగను, నరసింహరూపముగను, అవతరించెనని వర్ణింపబడినది. ఇట్లు మానవులు దేహధ్యాస గలవారై ఈశ్వరుని దేహధారిరూపముగా కల్పించిరి. అప్పుడప్పుడవతరించెనని కల్పించిరి. ఎప్పుడు ధర్మము క్షీణించి అధర్మము ప్రబలమగునో అప్పుడు ధర్మసంరక్షణార్థమై, ఈశ్వరుడవతరించునని చెప్పబడియున్నది. ఈ విషయముగూడ నేను పైన నుదాహరించినప్రకారము ఆహద్దు (మేర) వరకే నిజమగును. లేనిచో ఆజన్ముడు జన్మించుటేమిటి? ఏదో ఒక చరిత్రాత్మకమగు పురుషుడు ఈశ్వరరూపముగా గాని లేక యీశ్వరుడు చరిత్రాత్మకమగు పురుషుడుగా గానిజన్మించినాడని నమ్ముట కారణమేమియులేదు. మహాపురుషుల గుణ గణములనుజూచి మానవులు వానినిపూర్ణావతారమనియుఅంశా

వతారమనియు నమ్మిరి. మరియునిది యెరిగియుండియునుగూడ వాల్మీకి లేక తులసీదాసుయొక్క రాముని వేర్వేరుపాసకులు తమ యీశ్వరుడతడేనని నమ్మిరి. వారట్లు భజియించుటయందు అట్టి కీర్తనలు గానముచేయుటయందెట్టిదోషమును లేదుగాని నేను ప్రథమమున జెప్పిన విషయము జ్ఞాపకముంచుకున్నచాల మంది భ్రమపడుటకేమియు కారణముండదు. ఎవరైనను మన యెదుట కుశంకలనుంచి మనలను భ్రమలోపడవలయునని ప్రయత్నించిన వారితో మేము దేహధారియగు రాముని పూజించుట లేదనిచెప్పుడు. మేము నిరంజనుడును, నిరాకారుడునునగు రాముని (భగవంతుని) పూజించుచున్నామని చెప్పుడు. ఆభగవంతుని దగ్గరకుసరాసరి చేరజాలముగాన యెవనియందు యీశ్వరకళ మూర్తిభవించినదని కల్పింపబడినదో వానికీర్తనలు పాడుచున్నాము.

మనము దేహరూపమగు గోడనుదాటి చూడజాలనంతవరకును సత్య, అహింసాగుణములు పూర్ణముగా మనలో ప్రకాశింపజాలవు. సత్యపరిపాలనను గురించి విచారించితిమేని దేహాధ్యాస వదలవలసినదే! యేలనన? సత్యమును పాలించుటకు చావవలసి వచ్చును. అహింసావిషయమునుగూడ నింతియే! దేహము అభిమానమునకు కారణమగుచున్నది. దేహము యెడల రాగమున్నవాడు అభిమానరహితుడు కాజాలడు. యీదేహము నాదియనుభావము నామనస్సునందున్నంతవరకు నేను పూర్ణముగా హింసనుండి తప్పించుకొనజాలను. యీశ్వరసాక్షాత్కారము నభిలషించువాడు దేహమును దాటి

వెళ్ళవలయును. తనదేహమును తిరస్కరింపవలసి వచ్చును. మృత్యువు నాలింగనము చేయవలసి యుండును.

ఈరెండు గుణములు బొందినప్పుడే మనము తరింప గలుగుదుము. బ్రహ్మచర్యాది వ్రతముల ననుష్ఠింపగలము. సత్యము లేనిచో వాని ననుష్ఠించు టెట్లు? 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితముఖమ్, సత్యముయొక్క ముఖము సువర్ణపాత్రతో కప్పబడియున్నది. సత్యము పలుకుటకు, సత్యము నాచరించుటకు భయమెందులకు? అసత్యరూపమగు తెరతెరమెరయు మూతను తొలగించనంతవరకును సత్య దర్శన మెట్లు కాగలదు? ఎవరైన మనకపకారము చేసిన వానిని కోపించుటకు మారు ప్రేమించుట మనకు రుచించునా? మనము సంసారము అపారమైనదని పాడుచున్నాము. నన్ను చేరవలయునన్న సంసారమునుండి పరుగెత్తిరమ్మని రాముడు చెప్పుచున్నాడు- అయితే శరీరమును పరుగెత్తించినందువలన సంసారమునుండి పరుగెత్తినవారము కాజాలము- అపారవృత్తిని గలుగజేసుకొని 24 గంటలు పని చేయుచుండియునుగూడ మనము రాముని చేరగలము. ఈ విషయమే భగవద్గీతయందు బోధింపబడినది. కాబట్టియే నేను గీతను ఒక ఆధ్యాత్మికశబ్దకోశమని తలచెదను. ఆవిషయమునే తులసీదాసు మనకొక సుందరకావ్యరూపముగా యుపదేశించెను.

కాని నేను చెప్పినదే కీలకము అనగా! మనకల్పిత రాముడే నన్ను తరింపజేయును. నిన్ను తరింపజేయడు. ఏ రా

ముడు నిన్ను తరింపజేయును. నన్ను తరింపజేయడు. మనమందరము తులసిదానువలె సుందరకావ్యమును రచింప జాలము. కాని జీవితములో యీశ్వరానుభవముపొంది జీవితమునే కావ్యమయముగా చేయవచ్చును-

(ప్రమోదూత సం॥ చైత్ర శు ౯ లు)

---

# స్త్రీల స్థితి 15.

పురుషులు స్త్రీలవిషయమున చేసెడు దారుణకృత్యములకు ఆగ్రహమును చెందుటకు నేను బాలికనుగా నవసరములేదు. ఈ ఆక్రమములలో వారసత్వవిషయము మిక్కిలి తక్కువయనియే నేనుతలచెదను. వారసత్వపు చట్టమువలన స్త్రీలకు కలిగిన అక్రమముకంటె శారదాబిల్లువలన చక్కపరుపబడిన అక్రమమే ప్రబలమైనదిగాని స్త్రీలహక్కులనుగూర్చి అసమగ్రములగు నవగణలకు నేనెన్నటికినిసమ్మతింపను. న్యాయశాస్త్రప్రకారము పురుషులకుగల హక్కులన్నియును స్త్రీలకుగూడ పూర్తిగా నుండవలసినదనియే నా యభిప్రాయము. పుత్రులను, పుత్రికలను సర్వవిషయములయందు సమానముగానే చూడవలెను. స్త్రీలకు విద్య బాగుగా వ్యాపించినకొలదియు వారి బలమును వారు గ్రహింపగలుగుదురు. తమకు గలుగజేయబడుచున్నదారుణములగు నక్రమములను వారపుడెంతమాత్రమును సహింపరు. న్యాయశాస్త్ర సంబంధములగు నక్రమములను తొలగించినంత

మాత్రమున పని పూర్తిగాదు. ఈ అనర్థకము మిక్కిలి లోతుగా నేవేరూనియున్నది. పురుషుని కర్త్వాధికారముపట్లగల తీవ్రకాంక్షయే దీనికి ముఖ్యకారణము. దీనికంటెను స్త్రీ పురుషులమగల సంభోగలాలస్యమే ముఖ్యతమమగు కారణము. సొత్తుపైని యాజమాన్యము లభించుటవలననే అధికారముచేకూరును అధికారముపై ఆధారపడిన ఆక్రమయశమునుగూడ పురుషుడపేక్షించును. తండ్రియొక్క కుటుంబసంబంధమగు సొత్తును ఆతనికి జనించినవారికందరికిని సమముగా విభజించినయడల యిది లభింపజాలదు. ఒకతండ్రికి పుట్టినవారందరునుగూడ సమానహక్కుదారులని నిర్ణయింపబడినచో అతని ఆస్తిని వారందరికిని సమముగానే విభజింపవలసివచ్చును. కావుననే కుటుంబఆస్తి సాధారణముగా జ్యేష్ఠపుత్రునకే చెందుచున్నది. స్త్రీలలో చాలమంది పెండ్లి చేసికొందురు. న్యాయశాస్త్రము స్త్రీ విరుద్ధముగానున్నను, భర్తయొక్క అధికారస్వాతంత్ర్యములలో స్త్రీకి సమానసాక్కుగలదు. తాను ధనికుని భార్య కావలయుననియే ప్రతి స్త్రీయును కోరుచుండును. కావున స్త్రీలు సభలలో పాండిత్యప్రకర్షకారక సంస్కరణమున కనుకూలముగా ఓట్లనిచ్చినను, ఆప్రకారమునడుచకొనవలసివచ్చినపుడు చాలమంది నిలువబడజాలరు. అటుల నిలువబడినచో వారికిగల సదుపాయములు తొలగి పోవును. వారు వానిని వదలజాలరు.

న్యాయశాస్త్రప్రకారము స్త్రీలమగల ఆక్రమములన్నియు తొలగవలెననియే నేనెల్లపుడును వాదించుచుందును.

వాదించు చుండునుగాని, మన దేశమునందు విజ్ఞాన వతియగు స్త్రీ లేదని ప్రధానకారణమునుగూర్చి పనిచేయవలెనని నేను కోరెదను.

త్యాగమును కష్టానుభవమును స్త్రీలలో మూర్తీభవించిన విగాన వారు ప్రజాసేవను గడంగినచో యది పునీతమగుటయే గాక, నిరంతరమగు దురాశకును, సొత్తును కూడబెట్టుటనుగూడ విరోధమేర్పడును. మనుష్యులలో కోట్లకొలదిమంది నిర్ధనులుగా నేయున్నారుగాన వారుతమబిడ్డలకియ్యదగిన ఆస్తియేమియును వారికిలేదు. కావున అల్పసంఖ్యాకులగు ధనికులకుగూడపిత్రీయమగు ఆస్తి చెందకూడదు. తలిదండ్రులు తమబిడ్డలకు నిజముగా చెందచేయదగిన ఆస్తి తమసద్వర్తనమును విద్యయును మాత్రమే యగును. తమబిడ్డలందరును ఆత్మవిశ్వాసము కలిగి స్వతంత్రముగా కష్టపడిపనిచేసి జీవింపగలుగునట్లు జేయుటయే తల్లిదండ్రుల ముఖ్యధర్మము. కష్టములను పెంచవలసిన భారము జ్యేష్ఠులమీదనే యుండును. తమబిడ్డలు స్వతంత్రముగా జీవించుటకు తగినవిద్యను వారికి నేర్పింపవలెను. ప్రశంసనీయమగు సంకల్పము ధనికులకు కలిగినచో వారిబిడ్డలు హెచ్చుమంది యిప్పటివలె మందమతులుగాయుండునట్టి దురవస్థ తొలగిపోవును. వారిని కుటుంబ ఆస్తికి బానిసలుగా జేయవలెనను నింద్యమగువాంఛ ధనికులకుండుటచే వారిబిడ్డలు నిరుత్సాహులును, విషయభోగ పరాయణులును, సోమరులును, అగుచున్నారు. చిరకాలమునుండి వేరూనియున్న యిట్టి అనర్థములను రూపుమాపుట విజ్ఞానమతులగు సతీమణుల ముఖ్యాశయముగా నుండవలెను.

స్త్రీలు తమ అర్హతలను గోలుపోవుటను స్త్రీపురుషులమగల పరస్పర సంభోగవాంఛగూడచాలముఖ్యతమమగు కారణమను విషయముగూడ సర్వజనవిదితమే! స్త్రీలు అప్రయత్నముగా నేదుర్భావము లేకుండగనే చేయుచుండునట్టి పలువిధములగు సూక్ష్మకార్యములవలన వారు పురుషులను వంచితుల నొనరించుచున్నారు. ఇటుల స్త్రీలు తమ్ము వశపరచుకొనకుండ నిరోధించుటకుపురుషులుకూడ దుర్భావములేకుండనే అప్రయత్నముగానే ప్రయత్నించి విఫలులైరి. దాని ఫలితము కార్యవైఫల్యమేగాన నిది చాలముఖ్యతమగు సమస్యయేయగును. భరతమాత పుత్రికలలో విజ్ఞానవతులగు వారీ సమస్యను పరిష్కరింపవలసియున్నది. ఇందులకు వీరు అన్నివిషయములలోనూ పాశ్చాత్యులనే అనుకరింప గూడదు. ఏలననగా వారిపద్ధతు లచటిపరిస్థితులకు మాత్రమే పనికివచ్చును. వీరు భారతదేశ విజ్ఞానమునకును పరిస్థితులకును అనుకూలమగు విధానమునే అవలంబింపవలెను. పురుషులను నియమించుటలోను, పునీతులను గావించుటలోను, స్థిరచిత్తుల నొనరించుటలోను, స్త్రీలు అధికమగు సామర్థ్యము చూపవలెను. మన ప్రాచీన విజ్ఞానమున శ్రేష్ఠమైన దానినంతను భద్రపరుపవలెను. నీచమైనదానినంతను నిస్సంశయముగా తిరస్కరింపవలెను. సీతాదేవి, ద్రౌపదీదేవి, సావిత్రి, దమయంతి మున్నగు పతివ్రతామణులిట్టి ఘనకార్యములు చేయగల్గుదురు. గాని గయ్యాళులును, నంగనాచులును, జేయరు.

# స్వదేశీ వ్రతము 16.

స్వదేశీవ్రతము యీయుగమునందు మహావ్రతము. ఏది ఆత్మయొక్క ధర్మమో దానిని అజ్ఞానమువలనగాని, మరియేకారణము చేతగాని, మరచినపుడు దానివిషయమై వ్రతముబూనుటకు ఆవసరము కలుగును. ఎవరుస్వభావముచేతనే మాంసాహారికాడో వానికి మాంసాహారమును తినకుండుటకై వ్రతముబూను అవసరము కలుగదు. వానికిమాంసమందు కోరికయుండదు. దానిని చూచినవెంటనే వాంతియగును. స్వదేశీ ఆత్మధర్మమై యున్నదికాని, దానిని మరచిపోవుటచేత ఆవ్రతమునుబూనుట అవసరము. ఆత్మవిషయములో స్వదేశీయనగా సర్వప్రపంచిక బంధములనుండి విముక్తి. ఈదృష్టిలో దేహముకూడా పరదేశమే! ఇతరఆత్మలతో ఐక్యముపొందుటయందు దేహములను అడ్డంకులను కలిగించును. స్వదేశీధర్మమును తెలిసికొనినవాడును, దానిని పాలించువాడును, సర్వజీవులతో ఐక్యము పొందుచు శరీరమును త్యజించును.

ఈఅర్థమే సత్యమైనచో నిరుగుపొరుగువారి సేవయందే లీలమగుట స్వదేశీధర్మమని సహజముగా తెలియును. ఈవిధముగా సేవచేయునపుడు దూరమునందున్నవారుపేక్షింపబడుదురనిగాని, వారికి హానికలుగుననిగాని సందేహింపవచ్చును. అట్టిసంకోచము వట్టిభ్రమయేయగును. శుద్ధమైనస్వదేశసేవయందు శుద్ధమైన పరదేశసేవ యిమిడియుండును. "పిండమందువలెనే బ్రహ్మాండమందును"

దీనికి విపరీతముగా దూరదేశీయులకు సేవచేయుదుమన్న మోహమున పడినచో వారికి సత్యమగు సేవజరుగక పోవుటయే గాక పొరుగువారిసేవకూడా యుపేక్షింపబడును. రెండువిధముల నష్టము కలుగును.

నాపైననాధారపడియుండు కుటుంబమును గ్రామవాసులను వదలిపెట్టినయెడల వారికి నావలనకలిగిన ఆధారము పోవును. దూరముననున్నవారికి సేవచేయుటవలన వారికి సేవచేయుట యెవరిధర్మమో వారుస్వధర్మమును మరచెదరు. యీవిధముగా దూరదేశీయులకు అట్టిసేవచిక్కులను తెచ్చిపెట్టును. అక్కడివాతావరణము చెడును. స్వదేశమందుకూడా వాతావరణము తప్పకచెడిపోవును. ఈప్రకారముగా అన్నివిధముల నష్టముకలుగును. ఇట్టిఅసంఖ్యములగు ఉదాహరణములనుచెప్పి స్వదేశీధర్మమును స్థిరపరుపవచ్చును.

"స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మో భయావహః"

అని గీతము చెప్పుచున్నది. దీనికి అర్థము యిట్లు చెప్పవచ్చును. స్వదేశపాలన చేయునపుడు మృత్యువు కలిగినను శ్రేయమే కాని, పరదేశీ భయంకరమైనది.

## స్వదేశీఅనగా స్వధర్మము.

స్వదేశీతత్వమును తెలిసికొనకపోవుటచేతనే అన్నిచిక్కులు కలుగుచున్నవి. కుటుంబముపైనుండి మోహమువలన వారికి ప్రీతికలిగించుటకొరకునై నేను దొంగతనము దగాచేసినయెడల అదిస్వదేశీ కాజాలదు. వారియెడల నాస్వధర్మమును నిర్వర్తించవలయును. నాధర్మమును అరయుచు దాని పాలన

చేయుచుండినయెడల సత్యము పూర్ణమగు ధర్మమేదో అది తెలియును. స్వధర్మపాలనమున పరులధర్మమునకుగాని, పరులనుగాని హానికలుగదు. కలుగనూకూడదు. హాని కలిగినయెడల అభ్యసించిన ధర్మ స్వధర్మముకాదు. అది స్వాభిమానమగును. ఇందుచేత అది త్యాజ్యము. స్వదేశీధర్మమును పాలించునపుడు కుటుంబమును బలిదానము చేయవలసివచ్చుట సంభవింపవచ్చును. ఈ విధముగా చేయవలసివచ్చినప్పుడుకూడా ఆపనికుటుంబమునకు సేవయైయుండవలయును. ఏవిధముగా స్వార్థత్యాగమువలన ఆత్మరక్షణ చేయగలమో! అవిధముగానే కుటుంబత్యాగమువలన కుటుంబరక్షణ చేయగలము.

నా గ్రామమున ప్లేగు వ్యాపించినదనుకొనుడు. ఆరోగుల సేవచేయుటకు నా భార్యను, పుత్రులను, పుత్రికలను నేను ప్రేరేపించినప్పుడు రోగమునకు వశులై అందరు మృతినొందినయెడల నేను కుటుంబమును నాశనముచేసినవాడనుగాను. దానికి సేవచేసినవాడనగుదును. స్వదేశీధర్మమందు స్వార్థము ఉన్నదనుకొన్నను అది శుద్ధమైన స్వార్థము. శుద్ధస్వార్థము. శుద్ధస్వదేశీ అనగా అదిపరమార్థముయొక్క పరాకాష్ఠ.

ఈవిచారశ్రేణి ననుసరించి సమాజముయొక్క శుద్ధమైన స్వదేశధర్మము ఖాదీయిందున్నదని తెలిసికొంటిని. సులభముగా అందరు తెలిసికొనగలిగినది. ఈదేశమందు, ఈ యుగమునందు, అందరు పాలించవలసినట్టిది అగు స్వదేశీధర్మముయేది? దేనియొక్క సమాజపాలనవలన కోట్లకొలది భారతీయులకు రక్షణకలుగునో! అట్టి స్వదేశీధర్మమేది? దీనికి సమాధానము చర్ఖా! ఖాదీ! అని తెలుసుకొంటిని.

ఈ ధర్మమును పాలించుటవలన విదేశీమిల్లు యజమానులకు నష్టమువచ్చునని తలచకుందురుగాక. దొంగిలించిన సొత్తును

వాపసు చేయవలసివచ్చినప్పుడును దొంగతనము చేయకుండ నిర్బంధింపబడినపుడును, దొంగలకు నష్టముకలుగదు. వారికి లాభమేకలుగును. అన్యాయముగా సంపాదించినట్టి పాపపు ద్రవ్యము నాశనమైనయడల వారికిని జగత్తునకును లాభమే కలుగును. సారాత్రాగుడవల్ల మందువేయుట మానినయడల పొరుగుననున్న యీమత్తుపదార్థము లమ్ము దుకాణదారులకు నష్టముకలుగదు. లాభమే కలుగును. స్వదేశీధర్మమును ఆచరించువాడు పరదేశమును ద్వేషింపడు, పూర్ణమగు స్వదేశీవ్రతమందు ఎవరియడలను ద్వేషమునకును తావులేదు. ఇది సంకుచితమైన ధర్మముకాదు. ఇది అహింసాక్షేమమునుండి జనించిన సుందరమగు ధర్మము.

---

# కర్మయోగము 17.

కృష్ణభగవాను డిట్లనుచున్నాడు:-"సాకారమగు నావిగ్రహాముదందు మనసు నిలుపుము. నీవున్నదంతయు భగవంతుని దివ్యపాద సన్నిధినర్పింపుము. ఇట్లు చేయజాలకపోతివేని చంచలమగు మనోప్రవృత్తులను అభ్యాసయోగముచే గ్రహింపగడంగుము. యమనియమ ప్రాణాయామ ఆసనాది అష్టాంగయోగముచే మనస్సును వశపరచుకొనుము. ఇది చేయజాలకపోతివేని నీవుచేయుకార్యమును భగవత్కైంకర్యముగా చేయుచుండుము. ఇట్లు చేయుచుండుటవలన క్రమశః ప్రపంచవా

మోహమును బంధువర్గముపై ప్రేమయు తగ్గిపోవును. నీవునిష్కళంకుడవును, నిర్మలుడవును నగుదువు. నీలో లీనమైయున్న భక్తిభావము పైకి పొంగును.

## నిష్కామకర్మము.

ఇదికూడ నీవు చేయజాలకపోయినచో కర్మఫలత్యాగము గావింపుము. నీవు చేయు కార్యములకు ఫలితము కావలెనని కోరకుము. నీనియమిత కృత్యములను నిరంతరము చేయుచుండుము. తాను చేయుకార్యములయొక్క ఫలితములకు మనుజుడు కర్త కాజాలడు. కారణార్థములన్నియు సమకూడినతరువాతనే ఫలితము కలుగుననని తోచుచున్నది. కావున నీవు నిమిత్తమాత్రముగానే యుండుము. నీకు నేను బోధించిన నాల్గుమార్గములలో నొకటి గొప్పదని ఒకటి నీచమని తలపవద్దు. వీనిలో నీకేది వీలగునో దాని నంగీకరించి నన్ను చేరుము.

## నిజమగు భక్తుడు.

యమనియమాది యోగసాధనములకంటె భగవత్కథలను విని వానిని మననము చేసుకొని వానితత్త్వము గ్రహించు పద్ధతి సుకరమని తోచుచున్నది. భగద్గీతలో నిది జ్ఞానపద్ధతియని చెప్పబడినది. దీనికంటె చిత్తైకాగ్రతయు, పూజావిధియు సులభమార్గముగా నగపడుచున్నది. ఇది ధ్యానపద్ధతిగా వివరింపబడినది. కర్మఫలసన్న్యాసము దీనికంటె సులభమార్గముగా నుండవచ్చును. ప్రతివానికి ఒక్కటేపద్ధతి సుకరముగా నుండునని చెప్పవీలులేదు. కొందరు యీమార్గములన్నిటి నవలంబింపవలసియుండును. వీనికన్నిటికి పరస్పర సంబంధము గలదు.

ఎట్టివైనను నీవు భక్తుడవు కాదలచియున్నాడవుగదా గమ్యస్థానము యేమార్గమునైనను పొందుము. ఎవడు నిజమైన భక్తుడో చెప్పుటయే నావిధి. భక్తుడు నిరసూయుడు, తనయందును, నిఖిలభూతములందును, సమహితత్వంబున మెలంగువాడు. కరుణామయుడు. ఇట్టిపదమును బొందుటకతడు రాగద్వేషాదులను పారద్రోలును, అహంభావమును చంపుకొని వినమ్రుడగును. అతనికి కష్టములును, సుఖములును సమానములే! తనకపకారముగావించిన వారినతడు క్షమించును. తనతప్పిదములను క్షమించుటకుగాను ప్రపంచమును వేడుకొనును. అతడు నిత్యసంతోషి, సత్యప్రతిజ్ఞుడు, తనబుద్ధిని, మనస్సును, సర్వస్వమును భగవదధీనము గావించువాడు. ఇతర జీవజాలమునకతడు కష్టముగాని భయముగాని కలుగచేయడు. ఇతర జంతువులవలన నతనికష్టమును భయమునుగూడ యేమాత్రమును లేదు. భగవద్భక్తుడు శీతోష్ణ, కష్టసుఖేత్యాది ద్వంద్వాతీతుడు, కామాది రహితుడు, నిష్కల్మషుడు, వివేకి మత్సరశూన్యుడు, కర్మఫలత్యాగియై యతడు స్థిరప్రతిజ్ఞుడైయుండును. ఏది యెట్లు జరిగిననుసరే అతనికి దుఃఖము లేదు. ఇట్టివానికి పగవారులేరు. గౌరవము లేదు. అవమానము లేదు.

శాంతుడై, యదృచ్ఛాలాభసంతుష్టుడై, ఏకాకియై, ఆత్మజిజ్ఞాసాతత్పరుడై, ప్రపంచములో జరుగు కార్యములవిషయమై తామరాకుపై నీటిబొట్టువలె అంటీ అంటనట్లు ప్రవర్తించుచుండును. ఈవిధముగా ప్రవర్తించుచు నాయందు శ్రద్ధాతత్పరుడై యుండువాడు నాభక్తుడు.

## కర్మయోగము.

స్థితప్రజ్ఞుని లక్షణములను విని మనుష్యుడు శాంతముగా కూర్చుండవలయునని అర్జునుడుతలచెను. స్థితప్రజ్ఞుని వర్ణనలయందు కర్మయొక్క పేరుగూడ వినబడలేదు. గనుక అర్జునుడిట్లడిగెను. "మీయుపదేశమునుబట్టి కర్మకంటె జ్ఞానమధికమని చెలియుచున్నది. ఈకారణమున నాబుద్ధి వ్యాకులపడుచున్నది. జ్ఞానమే శ్రేష్ఠమైనయెడల నన్ను ఘోరకర్మయందు యెందుకు ప్రవేశపెట్టుచున్నావు? దేనియందు నాకు శ్రేయముగలదో దానిని నాకు స్పష్టముగా చెప్పవేడెదను".

భగవానుడు యీవిధముగా చెప్పెను. "అర్జునా! పూర్వమునుండియు యీప్రపంచమునందు రెండుమార్గములు ఆచరణలోనున్నవి. మొదటిది జ్ఞానప్రధానమైనది. రెండవది కర్మప్రధానమైనది. కర్మలేనిదే మనుష్యుడు అకర్మగాజాలడు. కర్మలేనిదే జ్ఞానములభింపదు. సర్వమును త్యజించి స్వస్థతగా కూర్చుండు మనుష్యుడు సిద్ధపురుషుడుగాజాలడు. ప్రతిమనుష్యుడు యేదియోయొక కర్మనుచేయుచుండుట నీవు చూచుచునేయున్నావు. ఆతని స్వభావమే ఏదోయొక కర్మను వానిని చేయించుచుండును. జగన్నియమము యీవిధముగా నుండగా ఏమనుష్యుడు కాలుమీద కాలువైచుకొని కూర్చుండి మనసునందు అనేక సంకల్ప వికల్పములను జేయుచుండునో వాడు మూర్ఖుడు. మిథ్యాచారియని చెప్పబడును. యింద్రియములను వశపరచుకొని రాగద్వేషములను వదలి ఆశక్తిరహితుడై కర్మనాచరించుట మేలుకాదా? నియతకర్మను నీవెంతుకువచ్చిన

సేవాకార్యమును ఇంద్రియములను వశపరచుకొని చేయుచుం డుము. సోమరివలె కూర్చుండుటకంటె సేవాధర్మము శ్రేష్ఠమై నది. సోమరియై కూర్చుండు వానిశరీరము తుదకు క్షీణించును. కర్మ చేయునపుడు యజ్ఞకార్యముతప్ప మిగిలిన కార్యములన్ని యు బంధకములని జ్ఞాపకముంచుకొనుము. యజ్ఞమనగా స్వార్థ మునకై కాక పరోపకారమునకై చేయునట్టికర్మ. కేవలము సేవా ర్థము చేయునట్టి సేవయందు, ఆశక్తి, రాగద్వేషములు వుండ నేరవు. ఇట్టియజ్ఞమును, సేవయును, చేయుచుండుము. బ్రహ్మ యీజగత్తును సృష్టించి దానితోపాటు యజ్ఞమునుకూడా సృ జించి చెవిలో యీ మంత్రోపదేశమును చేసెను. "పృథ్విని చే రుడు, పరస్పర సహాయము చేసికొనుడు. అభివృద్ధినిపొందుడు. సర్వజీవులను దేవతారూపములని తెలిసికొనుడు. సేవజేసి దేవతలను ప్రసన్నులుగాజేయుడు. వారు మిమ్ము ప్రసన్నులను గా చేయుదురు. ప్రసన్నులైన దేవతలు నీకోరికలను కోరకముం దే తీర్చెదరు. లోకసేవచేయకనే, భూతములకు వారిభాగమును వారికి అర్పింపకయే భుజించువాడుదొంగ. సర్వభూతిమును వారివారిభాగము నర్పించుచు యెవ్వడుతినునో, అనుభవించునో వానికి అనుభవించుటకు అర్హతగలదు. అనగా! వాడు పాపము నుండి ముక్తుడగును. దీనికి వ్యతిరేకముగా యెవరు తమ స్వలా భముకొరకే సంపాదించుకొందురో, వారుపాపులు. పాపభూ యిష్టమైన అన్నమును భుజించినవారగుదురు. అన్నమువలన జీవులు జీవించుచున్నారు. అన్నము వర్షమువలనను, వర్షము యజ్ఞమువలనను కలుగుచున్నది. యిది సృష్టినియమము అనగా!

సర్వభూతముల కర్మలవలన, శ్రమలవలన ఉత్పత్తియగుచున్నది. జీవులులేనిచోట వర్షములేదు. జీవులున్నచోట వర్షముండియే యున్నది. సర్వజీవులును తమ కర్మలను చేయునివియే! పరిశ్రమచేసి జీవించునవి- ఎల్లప్పుడు విశ్రాంతి తీసికొనువాడు దేనిని అనుభవింపజాలడు. ఈనియమము సర్వజీవులకు వర్తించునపుడు మనుష్యుని విషయములో దీని ప్రాముఖ్యమునుగూర్చి చెప్పనేల కనుకనే కర్మ బ్రహ్మసృష్టించెననియు బ్రహ్మఅక్షర బ్రహ్మ నుండి యుద్భవించెననియు భగవానుడు చెప్పెను. ప్రతియజ్ఞమునందును, ప్రతిసేవయందును, అక్షరబ్రహ్మ పరమేశ్వరుడు విరాజిల్లుచున్నాడని తెలిసికొనవలయును. ఈకాలచక్రమును ఎవడు అనుసరింపడో వాడుపాపి. వానిజీవితము వ్యర్థము. ఎవనికి ఆత్మశాంతికలదో, ఆట్టివానికి చేయవలసినకార్య మేది యులేదని చెప్పవచ్చును.

వానికి యేకార్యమును చేయుటయందుగాని, చేయకపోవుటయందుగాని, యెట్టిలాభమునులేదు. అతనికిదేనియందును స్వార్థముండదు. కాని, వాడు యజ్ఞకార్యమును వదలజాలడు. నీవునిత్యము కర్తవ్యకర్మను చేయుచుండుము. దానియందు రాగద్వేషములుంచవలదు. దానియందు అసక్తికలిగియుండవలదు. ఎవడు అనాసక్తిపూర్వకముగా కర్మనుచేయునో వాడే యీశ్వరసాక్షాత్కారము పొందును. జనకాదులు నిర్లిప్తులై రాచకార్యములను చేయుచు సిద్ధినిపొందిరి. వారు లోకహిత ములకొరకే కార్యములను చేయుచుండిరి. దీనికి విపరీతముగా నీవుయెట్లు ఆచరింపగలవు? యోగ్యులనియు, మాన్యులనియు

తలపబడువారు యేవిధముగా నడచుకొందురో ఆవిధముగానే జనసామాన్యము నడచుకొనును, నియమమునీరీతిగానున్నది నన్నుచూడుము. కర్మనుజేసి, నను యెట్టిస్వార్థమును పొందవలసియున్నది. నేను గం 24లు విశ్రాంతిలేక కార్యమందే నిమగ్నుడనై యున్నాను. నన్నుచూచి లోకముకూడా కొలదిగనో గొప్పగనో! నన్ను అనుసరించుచున్నది. నేను సోమరినై యున్నచో ప్రపంచస్థితి యేమగును? సూర్యచంద్ర నక్షత్రాదుల గమనము స్తంభించిపోవును. జగత్తు నశించును. దీని నీవు తెలిసికొనగలవు నేనేకదా! వీనినన్నిటిని నియమమందు వుంచువాడను నడపువాడను. నేను అనాసక్తుండను లోకులు అసక్తులు స్వార్థపరులై కర్మము చేయుదురు. లోకులకు నాకును యిదియే భేదము నావంటిజ్ఞానులు కర్మను వదలినయెడల లోకులు కూడా అట్లే చేయుదురు. బుద్ధిభ్రష్టులగుదురు. నేను ఆసక్తి వదలి కర్మచేయవలయును. దీనివలన లోకులు కర్మభ్రష్టులు కాకుండుటయు, క్రమముగా అనాసక్తులగుటయు సంభవించును. మనుష్యస్వభావమునందున్న గుణములకు వశులైనవారు కర్మలనుచేయుచునే యుందురు. మూఢుడైనను చేయుచున్నానని తలచును. శ్వాసోచ్ఛ్వాసములు సర్వజీవులకు స్వభావములు కనురెప్పమీద నేదైనపడిన అది స్వభావముగనే వాలును.

అప్పుడు నేను శ్వాసపీల్చుచున్నాననిగాని, రెప్పవాల్చుచున్నాననికాని యెవడును చెప్పడు. ఈ విధముగానే చేయు కర్మలన్నియు స్వభావసిద్ధమైనవిగాను, గూఢానుసారమైనవి

గాను, ఎందుకు యుండకూడదు? వానిని చేయించుటయందు అహంకారమేల? సర్వకర్మలను నాకర్పించి నానిమిత్తము మమకారమువదలి, కర్మాదులు చేయవలయును. ఇదియే సర్వకర్మలను స్వభావసిద్ధముగా చేయుమార్గము. యిట్లుచేసిన మనుష్యునియందు అహంకారము స్వార్థభావము నశించి స్వాభావికములుగను, నిర్దోషములుగను అగును. అట్టివాడు అనేకచిక్కులనుండి విముక్తుడగును: అతనికి కర్మబంధమనునది యేదియును యుండదు. స్వభావానుసారముగా పని జరుగుచోట బలవంతపెట్టుట యనుభావము వుండజాలదు. వున్నయెడల అది అహంకారమేయగును. బలవంతమువలన బాహ్యకర్మలు ఆగిపోయినప్పటికిని అతనిమనస్సు సంకల్పవికల్పములతోనే నిండియుండును. ఇది బాహ్యకర్మలకంటె చెడ్డదియును అధికబంధనము కలుగచేయునదియు అయివున్నది.

ఇంద్రియములకు వానివాని విషయములయందు రాగద్వేషములుండుట వాస్తవము శబ్దేంద్రియమునకు ఒకదానియందు ప్రీతియు, మరియొకదానియందు అయిష్టమును వుండును. ఘ్రాణేంద్రియము గులాబిపుష్ప సుగంధమునందు ప్రీతియు, మలాదిదుర్గంధములందు అయిష్టమును కలిగియుండును. అట్లేఅన్నియింద్రియముల విషయములలోను వున్నది. మనుష్యులుచేయవలసినదేమన రాగద్వేషములను దొంగలను వశపరచుకొనవలయును. లేదా? వానిని బయిటికి పారద్రోలవలయును. కర్తవ్యకర్మయని వెతుకుచు తిరుగకూడదు. నేడు ఒకటి, రేపు రెండవది, యెల్లుండి మూడవది యీవిధముగా కార్యభారమును నెత్తిపై

నపెట్టుకొనకూడదు. తనవంతుగవచ్చిన కార్యమును యీశ్వర ప్రీత్యర్థము చేయుటయందు తప్పరుడు కావలయును. ఈవిధముగా చేయుచుండిన చేయునదంతయు యీశ్వరుడే చేయుచున్నాడను భావముకలుగును. ఈ జ్ఞానము కలుగును. అహంభావమునశించును. ఇదియే స్వధర్మము. స్వధర్మమునందు నిశ్చలముగా నుండవలయును. మనకు అదియే యుత్తమమైనది. పరుల ధర్మము ఎక్కువశ్రేష్ఠమైనదిగా గనుపించును. కాని అది భయంకరమని తెలిసికొనుము. స్వధర్మాచరణ చేయుచు మృత్యువును పొందుటయందే మోక్షముకలదు. రాగద్వేషరహితుడవై కర్మచేయవలయును. ఇదియే యజ్ఞము.

భగవంతుడు యిట్లు చెప్పగా అర్జునుడు యీ విధముగా ప్రశ్నించెను.

మనుష్యుడు దేనిప్రేరణచే పాపకార్యములు చేయుచున్నాడు. ఎవరో బలాత్కారముగా వానిని పాపకర్మవైపుకు యీడ్చుచున్నట్లు సాధారముగా తెలియుచున్నది. భగవంతుడు యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

మనుష్యుని పాపకార్యమువైపుకు యీడ్చుకొనిపోవువారు కామము క్రోధము. వీరిద్దరు అన్నదమ్ములు. కామము నెరవేరనప్పుడు క్రోధమువచ్చును. కామక్రోధములు కలవానిని రజోగుణము కలవాడని చెప్పుదుము. మనుష్యుని శత్రువులు వీరే. మానవుడు వీరితో ప్రతిరోజు యుద్ధముచేయవలసి యున్నది. అద్దముపై దుమ్ముపడిన మసకగా నున్నట్లును, నిప్పుపొగచే కప్పబడినట్లును, గర్భము మావిచే కప్పబడినట్లును, జ్ఞానియొ

శక్క జ్ఞానమును కామక్రోధములు ప్రకాశింపనీయవు. కామము అగ్నివలె భయంకరమైనది. అది యింద్రియములను, మనస్సును, బుద్ధిని తనవశమందుంచుకొని మనుష్యుని నాశనము చేయును. కాన, ప్రప్రథమమున నీవు యింద్రియములను వశపరచుకొనుము. పిమ్మట మనస్సునుగూడ జయించుము. ఇట్లు చేసిన బుద్ధికూడ నీవశమగును. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఒక దానికంటె మరియొకటి మించినవైనను వీని యన్నిటికంటె ఆత్మ చాలా శ్రేష్ఠమైనది. మనుష్యునకు తనఆత్మ (తనశక్తి) యొక్క ప్రభావము తెలియదు. ఆత్మశక్తి తెలియకనే యింద్రియములు మనస్సువశమందుండవనియు బుద్ధిపనిచేయదని తాను తలచుచున్నాడు. ఆత్మశక్తియందు విశ్వాసముకలుగగనే మిగిలినవన్నియు సులభము లగును. ఎవడు యింద్రియములను, మనస్సును, బుద్ధిని వశమందుంచుకొనునో వానిని కామక్రోధములు వాటి అసంఖ్యాసైన్యమును యేమియును చేయజాలవు.

ఈ అధ్యాయమును గీతను తెలిసికొనుటకు కీలకమని చెప్పియుంటిని. దీనిసారమేమన! "జీవితము సేవకొరకు, భోగమునకు గాదు." అని యొకవాక్యములో తెలిసికొన నగును. కనుక జీవితమును యజ్ఞమయముగా చేసికొనవలయును. యిది తెలిసికొన్నంతనే పని పూర్తికాజాలదు. దీనిని తెలిసికొని ఆచరించుచుండినచో వుత్తరోత్తర పరిశుద్ధులమగుదుము. అయితే నిజమైన సేవయని దేనిని చెప్పవలయునో తెలిసికొనుటకు యింద్రియనిగ్రహము ఆవశ్యకము. యిట్లు చేయుచుండినచో ముందుముందు మనము సత్యరూపమగు పరమాత్మ సాన్నిధ్యమందు

చేరుదుము. క్రమక్రమేణా మనకు సత్య సాక్షాత్కారము పూర్ణముగా కలుగును. సేవాకార్యముకూడా స్వార్థదృష్టితో చేసినయెడల అది యజ్ఞముకాజాలదు. కనుక అనాసక్తి పరమావశ్యకము. యిది లభించినపిమ్మట మనము యితర వాదవివాదములయందు ప్రవేసించ నవసరముండదు. అర్జునునకు నిజముగా స్వజనులను చంపవలయునని యుపదేశించెనా? యుపదేశమందిదికలదా? యిట్టిప్రశ్నలు కలుగజాలవు. అనాసక్తి లభించిన పిమ్మట మనచేతిలో యెవరినైనా చంపుటకు కత్తియున్నను సహజముగానే అది చేతినుండిజారి క్రిందపడును. అనాసక్తి ఆడంబరముచే లభించునదికాదు. ప్రయత్నించిన నేడే లభించవచ్చును. లేదా! వెయ్యిసంవత్సరములు ప్రయత్నించినప్పటికిని లభింపకపోవచ్చును. దీని విషయమైన చింతనుగూడా మనము విడువవలయును. ప్రయత్నమందే ఫలితమున్నది. మనము ప్రయత్నము సరిగా చేయుచున్నామా! లేదా! యనువిషయమునందు పూర్ణముగా ధ్యానముంచవలయును. యిందు ఆత్మవంచనకు తావుండరాదు. దీనిని గమనించుట అందరికి అవశ్యకమై యున్నది.

---

## దౌర్జన్యమునకు ప్రతిక్రియ. 18

దౌర్జన్యమునకు ప్రతిక్రియ దౌర్జన్యముకాదు. ప్రతిపక్షుల పరుషసంభాషణములకన్న ఎక్కువ పరుషముగ మాట్లాడుట, ఒకదెబ్బకొట్టిన వానిపై రెండుదెబ్బలుకొట్టుట, అల్లరిచేయు

టకై ప్రతిపక్షులు అయిదుగురును పంపిన వారిని అడచుటకై మనము 10ని పంపుట సులభము, కాని, యిట్టి కార్యములవల్ల యిహలోక సంబంధమగు లాభము, యెంతమాత్రము కలుగదు. పరలోక సంబంధమగు లాభము కలుగుననిచెప్పిన, అట్టిపరలోకము పురాణములయందు సూచింపబడిన నరకముకన్న నికృష్టమైనదని చెప్పవచ్చును. ఈ విధమున క్రమముగా పెరుగుచున్న దౌర్జన్యమును ప్రతిక్రియ యేమి? ప్రార్థనచేయుట, నిరసనదీక్షవూనుట, పూర్వకాలమునుండి యనుసరింపబడుచున్న ప్రతిక్రియ. కాని, యిట్టిప్రార్థన నిరసనదీక్ష త్రికరణశుద్ధిమైనదిగా నుండవలెను. చిలుకలుచెప్పు విధమున దైవప్రార్థన, గీతములనప్పచెప్పుట, ఆహారమునుమాని దేహమునుశుష్కింపచేయుట, నిష్ప్రయోజనకరము. మనలో భగవంతుడున్నాడను నమ్మకము గలిగినవారికే ప్రార్థనలవల్లను, నిరసనదీక్షవల్లను లాభము కలుగును. తమ్ముతాము మోసపుచ్చుకొనుట తగిన కార్యము కాదు.

కావున దౌర్జన్యము రూపుమాపవలయుననిన దౌర్జన్యము వృద్ధిచెందుటకు అవకాశముల నివ్వకూడదు. యేదైన నొకసభ జరుగుచున్నప్పుడు గుండగీండ్రు ఆసభను ఆక్రమించుకొనినట్లు తెలిసిన అహింసావాదులు ఆసభను వదలిపోవుట శ్రేష్ఠమగు కార్యము. దౌర్జన్యము, సత్యమును అడచివేయజాలదు. కావున సత్యాన్వేషులు దౌర్జన్యమునకు ప్రతిగా దౌర్జన్యమును సలుపక, ప్రతిపక్షు దౌర్జన్యమును సహించిన సత్యమే తుదకు జయము గాంచగలదు. కాని, సత్యమేదియో తెలిసికొనవలెను

టచేతనే గొప్పచిక్కులు యేర్పడుచుండును. మన ప్రతిపక్షులు అసత్యవాదులని చెప్పుట సులభము. కాని, మనవాదము సత్యమైనదని నిరూపించుటకు వీలులేనప్పుడు ప్రతిపక్షుల దూషణ కన్న సహనము, ఉత్కృష్టమగు కార్యము. ప్రతిపక్షులనిర్బంధము లేక యెవరి యభిప్రాయములను వారు ప్రకటించుకొనుటకు అవకాశము లేకున్నచో శాంతియుతమగు జీవితము గడుచుట దుర్లభము.

కాని దౌర్జన్యము జరుగుచున్నప్పుడు ఆత్మరక్షణకూడా గావించుకొనగూడదా ? అని ప్రశ్నింపవచ్చును. అహింసా సిద్ధాంతమునందు సంపూర్ణవిశ్వాసముగలవారికి యీవిషయమై యెట్టి సందేహములుండవు. ప్రతిపక్షులు దౌర్జన్యము సలుపునప్పుడు ఆత్మరక్షణకై యెట్టిప్రయత్నములు గావింపకుండుటయే ఉత్తమమగు ఆత్మరక్షణవిధానమని అహింసావాదులు గుర్తెరిగియున్నారు. కాని సిద్ధాంతములను ఆదర్శములను ప్రకటించుటచే ప్రజలలో యిట్టిమనోభావము లేర్పడుట అసంభవము. యీవిషయమై దీర్ఘమగు వాదములు సలుపుట అనవసరము. మన నిస్సహాయస్థితి మనము గుర్తెరుగవలెను. బలహీనులకు బలము భగవంతుడను ఆర్యవాక్యమును స్మరణకు తెచ్చుకొనవలెను. ఈసూత్రమును దేశీయులు ఎంతత్వరలో గ్రహించిన్ని అంతత్వరలో దౌర్జన్యము అంతమొందగలదు.

# భగవంతునియచింత్యాద్భుతశక్తి 19

ఒక అనిర్వ్యాప్తమును, అచింత్యాద్భుతమునగు మహాశక్తి. అది అంతర్బహిర్వ్యాప్తము. దానిని నేను గ్రహించగలనుగాని చూడజాలను. అగోచరమగు నీమహాశక్తి కలదని అందరును గ్రహింపగలుగునట్లది చేయుచుండును. గాన అది నిరుపమానమును, భౌతిక శరీరమునను వేద్యములగు విషయములలో ఆ మహాశక్తితో పోల్చదగినది యొక్కటియును లేదు గాన నీశక్తికలదని రుజువుచేయుట యెవరికినిగూడ అలవిగాకుండ నున్నది. నేను నాయింద్రియములతో దానిని కనిపెట్టెదను. అది యింద్రియముల కతీతము. కాన, అనుమాన ప్రమాణము వలన (యుక్తి) భగవంతుడు కలడను నిర్ణయించుటకు కొంత వరకు, అవకాశము కలదు.

పరిపాలకుడు యెవడు? అతడెటుల పరిపాలించుచున్నాడు? ఏల పరిపాలించుచున్నాడు? అను విషయములను, సామాన్య విషయములలో సైతము ప్రజలు గ్రహింపజాలరు. కాని పరిపాలించుచున్న మహాశక్తి యొకటికలదనిమాత్రము అందరును యెరుగుదురు. నేను నిరుడు మైసూరులో సంచారము చేసినప్పుడు గ్రామములలో చాలమంది బీదవారిని చూచితిని. మైసూరు యెవరు పరిపాలించుచున్నారని వారిని నేను యడుగగా మాకు తెలియదని వారు చెప్పిరి. దేవుడే పరిపాలించుచున్నాడని వారు చెప్పిరి. తమదేశమును పరిపాలించుచున్న రాజు సంగతియే! యీ గ్రామవాసులకు తెలియనపుడు, రాజుతో

పోల్చినచో అనంతానంతగుణములు అధిపుడును మహాశక్తి సం పన్నుడును అగు భగవంతుని అత్యల్పశక్తిగల మానవుడనగు నేను, తెలిసికొనజాలకపోవుటలో నేమి వింతయున్నది. భగ, వంతుడు సర్వేశ్వరేశ్వరుడు.

భగవంతుడు పరిపాలించుచున్నాడని ఆగ్రామవాసులు గుర్తింపగలుగునట్లు నేనుగూడ గుర్తింపగలిగితిని. ప్రపంచ మందొక క్రమపద్ధతి ప్రకారమే సర్వమును జరుగుచుండును. మార్పుతరముగాని యొకనియమమును అనుసరించియే! అంత యును జరుగుచుండును. దానిని అనుసరించియే సకలప్రా ణములును జీవించుచుండును. అది అంధప్రాయమగు నియమ మూకాదు. అంధప్రాయమగు నియమముచే తనులను బంధింప జాలదు, అచేతనములలోకూడా ప్రాణముకలదని సర్ జగదీశ చంద్రబోసుగారిపుడు లోకమునకు వెల్లడించిరి. ఆనియమమే భగవంతుడు యేర్పరచిన నియమము. నియమమునకును నియామ కర్తకును అభేదము. ఆనియమమునుగూర్చియును, ఆకర్తను గూర్చియును, నాకేమియును తెలియనంత మాత్రమున, "ఆ నియమములేదు. ఆ కర్తయును లే"డని నేను చెప్పజాలను. మైసూరురాజు లేడని గ్రామస్థులు తలచినంతమాత్రమున రాజాజ్ఞలను అతడు యెటుల అతిక్రమింపజాలడో! అట్లులనే భగవంతుడులేడని నేను తలచినంతమాత్రమున భగవన్నియమ ములను నేను అతిక్రమింపజాలను. కాని, నా అల్పజ్ఞతను, అల్పశక్తిని, భగవంతుని సర్వజ్ఞతను, సర్వశక్తిని, సర్వోత్తమ మత్వమును, నేను గ్రహించి, వినయవిధేయతలతోను, భక్తి

తోను, భగవంతుని నమ్మియున్నచో! నా జీవయాత్ర సుఖము గా గడచును. రాజాజ్ఞలకు బద్ధులగువారు సుఖముగా జీవింప గలుగుటయే దీనికి ప్రత్యక్షనిదర్శనము. ప్రపంచమున ప్రతి పదార్థమును ప్రతి క్షణమునను మారుచున్నట్లు చూచాయగా నేను తెలిసికొనగలిగితిని. కాని, దీనికంతటికిని సృష్టిస్థితి లయ నియమాదులకు ముఖ్యకర్తయగు సర్వేశ్వరుడు శాశ్వతుడు. అత నికెన్నటికిని మార్పుగలుగదు. మన కనులకు కనబడున వన్ని యును నశించి పోవుచుండును. గాని, అతడనంతుడు.

ఈ భగవంతుడు దయామయుడా? యితడు సంపూర్ణము గా దయామయుడు! మరణములో జీవితమును, అసత్యములో సత్యమును, అంధకారమున తేజమును స్థిరముగా నుండగలుగు చున్నవి. యీ జీవితమును సత్యమును, తేజమును, ప్రేమ యును, గూడ దేవుడే! అతడే సర్వోత్తముడగు సర్వేశ్వరుడు. కేవలము విజ్ఞానమునకు మాత్రమే తృప్తిగలిగిన చాలదు. హృద యమునందుకూడ పరివర్తనము కలుగవలెను. భక్తుడొనరించు స్వల్పకార్యమునందుకూడ భగవన్మహిమ గోచరము కావలెను. అందులకు భౌతికేంద్రియముల అనుభవము చాలదు. వాటి నతిక్రమింపగల యనుభవము కావలెను. భౌతికేంద్రియముల ద్వారా కలుగుజ్ఞానము యెల్లప్పుడును సత్యముగానే యుండదు. తరుచుగా మిథ్యాజ్ఞానమును విపరీతజ్ఞానమునుకూడ కలు గుచుండును. ఈజ్ఞానము భ్రాంతిమూలకము. ఇంద్రియాతీత మగు జ్ఞానమే నిశ్చితమగు జ్ఞానము. తనహృదయ కమలముల లోనున్న భగవంతుని అంతర్దృష్టివలన చూడగలవారి జీవితము

అలో కలిగిన మార్పులిందులకు ప్రబల నిదర్శనములుగా నున్న వి.

ఇట్టి మహాపీయులు అన్ని దేశములలోను, అన్ని కాలముల లోను కలుగుచునే యుందురు. ఈసత్యమును తిరస్కరించుట తన వ్యక్తిత్వమును నమ్మజాలక పోవుటయేయగును.

భగవంతునియందు అచంచలభక్తి కలిగిననేగాని యీ ఆత్మ సందర్శనము లభింపదు. నిరుపమానమగు భక్తివలననే భక్తుడు తనలోనున్న పరమేశ్వర బింబమును సందర్శింప గలుగును. ఈ విశ్వాసమును ధృఢపరుప దగిన నిదర్శనములు ప్రపంచమునం దుండజాలవు. గాని ప్రపంచము నందలి నైతిక పరిపాలనము నందును, నైతిక నియమాధిక్యము నందును, ప్రేమయొక్కయు, సత్యముయొక్కయు, నియమమునందును, సంపూర్ణ విశ్వాసమును గలిగియుండవలెను. సత్యమునకును ప్రేమకును విరుద్ధముగానుండు వాటినన్నిటిని తక్షణమే తిరస్కరించుటకు గిట్టిదీక్షను బూనగలవారికి విశ్వాసమే నిరపాయకరమగు సాధనము.

భగవంతుడు కలడనునమ్మకము హేతువాదమువలన నేను కలిగింప జాలను. విశ్వాసము హేతువాదమున కతీత మైనది. అసాధ్యమైన దానిని సాధించుటకు ప్రయత్నింప కూడదు. ప్రపంచమున దోషమాకలదని యుక్తిచే నేనుస్థాపింపజాలను. భగవంతుడొకడే అటుల చేయకలడు. ప్రపంచమున దోషము అనగా చెడుగలదనుట నిశ్చయము. ఈ ప్రపంచమును చెడు గగూడ నుండుటకు, భగవంతుడు సమ్మతించుటచే భగవంతు

డధికమగు సహనము కలవాడని నేను వినమ్రుడనై విశ్వసించె దను. భగవంతునియందు దోషలేశమైన లేదని నే నెరుగుదును. కాని, భగవంతుడు కలిగింపకున్నచో దోషము ప్రపంచమున నుండజాలదు. కాని, ఆదోషము భగవంతునకు గలుగదు.

ఈ దోషముతో నేను తీవ్రముగా పోరాడి జయమును బడసిననేగాని నే నెన్నిటికినిగూడ భగవంతుని తెలిసికొన జాలను. నాకుగల యనుభవము అత్యల్పమెయైనను దానివలన నాకు భగవంతునియందు స్థిరమగు విశ్వాసము కలిగినది. నాయందు పవిత్రత అధికమగుచున్న కొలదిని నేను భగవంతునకు చేరువ యగుచుందును. నాకిపుడుగల భక్తినామ మాత్రమే! ఈ భక్తి హిమాలయ పర్వతాగ్రములవలె స్వచ్ఛతమమును సుస్థిరము నైనపుడు, నేను భగవంతునకు మిక్కిలి చేరువగా నుండగలుగుదును.

---

## ఉపదేశరత్నములు 20

(1) చిరకాలమునుండి వచ్చుచున్నను పూర్వసాంప్రదాయములే మతముకాజాలవు. వాటియందుండు మూర్ఖవిశ్వాసములే మతముకాజాలదు.

(2) భోజనప్రతిభోజనముల నిషేధించుటలో మతములేదు. ఎల్లరపంక్తిని భుజించితీరవలయుననుటయు మతముకాదు. ఎల్లరతో కలసి భుజించుట మతభ్రష్టత్వముకాదు. ఆహారము వ్యక్తి స్వాతంత్ర్యమునకు సంబంధించిన విషయము.

(3) పుట్టుకవల్లనే యెవ్వరికిని అధిక్యతరాదు. కర్మమువల్లనే న్యూనాధిక్యతలు లభింపగలవు.

(4) సనాతన చాతుర్వర్ణములకును, ప్రస్తుతపుకులములకును పోలికయేలేదు. సనాతనవర్ణాశ్రమ ధర్మముల విభాగము ప్రశంసనీయమే!

(5) హిందూమతమందలి మహావిజ్ఞానమయుడగు బ్రాహ్మణుడు లేకున్నచో, హిందూమతమునకు తలయే లేదనవచ్చును

(6) తల్లిదండ్రులచే బాల్యమున వివాహము చేయబడిన వరుడు మరణించినచో ఆమె విధవయేకాదు. ఆమెకు వివాహమొనరించుట పునర్వివాహముకాజాలదు.

(7) బాల్యమునందు ముడిపెట్టబడిన వరులు చనిపోవుచో. అట్టి బాలికకు వివాహమొనరించుట తల్లిదండ్రుల విధి; ధర్మము.

(8) వరవిక్రయము మహాపాతకము వివాహములలో లాభములకై వేలకొలది వ్యయబుచ్చుట దురాచారము.

(9) వివాహము పుణ్యకర్మ ఇది శరీరములకు సంబంధించిన బంధముగాదు, ఆత్మలయైక్యము. భార్యాభర్తల యందెవ్వరు. మరణించిననుగూడ యీబంధము తెగిపోవునదికాదు.

(10) వేశ్యలచే దేవాలయములయందు నృత్యము చేయించుట, సయితానును పూజించుట తప్ప వేరుకాదు.

(11) ప్రస్తుత దేవాలయములయందు దేవుడుండజాలడు; అనేక దుష్టాచారములకు లోనైన యీదేవాలయములయందు దయ్యమే పూజింపబడుచున్నది.

(12) మాతృదేవతలగు స్త్రీలను వ్యభిచారవృత్తికై నొకతెగక్రింద విభజించుట ఆత్మవంచనము. ఈ సాంఘికదురాచారము వెంటనే నిర్మూలింపవలెను. వేశ్యాబాలికలకు వివాహముగావించుకొనుటకు, హిందూసంఘమంతయు సర్వవిధముల తోడ్పడుటవిధి; ధర్మము.

(13) భగవంతుడనసత్యమే! అహింసయే సత్యమునకు సర్వస్వము.

(14) బ్రహ్మచర్యమే జీవనము, శక్తి, తేజము.

(15) రహస్యముగా మాట్లాడవలెననుట పిరికితనము. రహస్యాలోచన, రహస్యభావము, మహాపాతకము.

(16) అహింస పిరికివారికి లభించునదికాదు. మహాధయిర్యవంతుడె సంపూర్ణ అహింసావ్రతుడు కాగలడు.

(17) శాత్రవునిబాధ అహింసా ప్రియుడై, ఆత్మశిక్షణతో అనుభవించజాలకున్నచో, శాత్రవునితో హింసామార్గమున పోరుటయైన సమంజసమే; కాని, పిరికివాడై పారిపోవుట మాత్రము అహింస కాజాలదు.

(18) చిత్తశుద్ధితో చేసిన ప్రార్థన అద్భుతకార్యముల చేయగలదు. అదియెన్నడవ పవిత్రతకొరకు ఆత్మ అనుభవించు తీవ్రవేదన ఇట్లు సంపాదింపబడిన పవిత్రత ఉదారకర్మయందు ప్రయోగింపబడుచో అదితిరిగి ప్రార్థనకాగలదు.

(19) క్రోధమునుండి సంకులత పుట్టును. బుద్ధితో కలసిన విరోధమందు సక్రమపద్ధతి కలదు.

నాయనుభవమునుండి నేర్చుకొనిన గుణపాఠమొకటికలదు.

ఆగ్రహమును బంధించి మూతవేసికొని లోన నిముడ్చుకొనుట మంచిది. కూడబెట్టబడిన యుష్ణము సమశక్తిగా నెట్లు మారునో అట్లే లోన నిముడ్చుకొన్న ఆగ్రహము ప్రపంచమునంతను గదల్పగల యఖండశక్తిగా పరిణమించగలదు.

హింసకన్న అహింసయే ఉత్తమము. శిక్షించుటకన్న క్షమించుటయే వీరుని లక్షణము. దృఢతరమగు చిత్తమునుండియే, బలము సముపార్జింపగలము. కాని బలిసిన శారీరక కండముల నుండిగాదు.

తన అహంభావమునే వెల్లడించును. అతి కృత్రిమశక్తిచే అట్లు సంస్కరింపనెంచుట అసాధ్యమగుదానిని ప్రయత్నించుట వంటిది.

(23) భౌతికసౌఖ్యాభివృద్ధి యేరీతిగానైనను ధర్మాభివృద్ధికి తోడ్పడనేరదు.

(24) వైద్యశాస్త్రము యింద్రజాలపారము కేవల నామమాత్రమైన వైద్యవిద్యాప్రావీణ్యముకన్న బూటకపు వైద్యమే మంచిది.

(25) పాశ్చాత్య నాగరికతయనిగాని, విరోపా నాగరికత యనిగాని, వేరుగాలేదు. ఉన్నది కేవల భౌతికమగు నవనాగరికత మాత్రమే.

(26) అహింస కొందరికి కేవలము రాజనీతియే కావచ్చును గాని నాకుమాత్రము అది స్వధర్మమేగాని రాజనీతిగాదు.

(27) మన సుగుణములను మనము కొండంతలగా ప్రకటించునెడల మన దుర్గుణములనుగూడ నటులనే వెల్లడింపక

తప్పదు. మన సుగుణములు హిమవత్పర్వతములవలె నున్నచో మన దుర్గుణములు కనీసము వింధ్యపర్వతములవలెనైనను న్నవి.

భగవంతుడు అచింత్యాద్భుతశక్తికలవాడు. అనిర్వాచ్యుడు. చేతనాచేతనాత్మకమగు సకలప్రపంచమునకు నియామకుడు. భగవంతునియందు మనము విశ్వాసముగలిగియున్నచో మనము సుఖముగా జీవింపగలుగుదుము.

సత్యాన్వేషకుని హృదయము కమలమువలె మృదువుగను, పాషాణమువలె అతికఠినముగను కూడ నుండవలెను. ప్రయత్నము లేకుండ ఆనందము లభించదు. కష్టము ననుభవించనిచో జీవితము సౌఖ్యప్రదముగాదు. భగవంతుడే సత్యము సత్యమే భగవంతుడు.

---

## 21 జ్ఞానయోగము.

భగవంతుడు చెప్పుచున్నాడు:—నేను నిష్కామ కర్మయోగమును తెలిపినాను. ఇది ప్రాచీనకాలమునుండి యాచరణలోనున్నదే! ఇది క్రొత్త విషయముకాదు. నీవు ప్రియభక్తుడవుగు, ధర్మసంకటమందు పడియున్నావుగనుకను, నీవు ముక్తుడగుటకు నుపదేశించితిని. ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మము ప్రబలమగునో! అప్పుడు నేను అవతరించెదను. భక్తులను రక్షించి, పాపులను సంహరించుచుందును. ఎవరు నా యీ మాయను తెలిసికొనునో, ఎవరు అధర్మము తప్పక నశించుననియు, సాధుపురుషులను రక్షించువాడు యీశ్వరుడే

ననియు, నమ్మెదుకో వారు ధర్మమును త్యజింపరు. అంతమందు నన్నే పొందుదురు. అట్టివారు నన్నే ధ్యానించువారుగనుకను, నన్నే ఆశ్రయించువారుగనుకను, వారు కామక్రోధములనుండి విముక్తులగుదురు. తపము, జ్ఞానమువలన పవిత్రులయి యుందురు. మనుష్యుడు తనకర్మనుబట్టియే ఫలితము బొందును.

నాశాసనమును అతిక్రమించి ఎవడును ఉండజాలడు. గుణ కర్మల భేదమునుబట్టియే! నేను నాలుగు వర్ణములను సృష్టించితిని. అయినప్పటికిని నేను వాటికి కర్తనని తలపవము. ఏల ననిన-నాకు ఆకార్యమునుండి యేవిధమైన ఫలాపేక్ష లేదు. దాని పాపపుణ్యాసులు నాకంటవు. ఈశ్వరుని యీ మాయ తెలిసికొనవలసినది. జగత్తులోని కర్మలన్నియు యీశ్వర నియమముల ననుసరించియే జరుగుచుండును. అయినను వానినుండి యీశ్వరుడు అలిప్తుడుగానుండును. అందుచే ఈశ్వరుడు కర్తయు అకర్తయుగూడనైయున్నాడు. ఇట్లు నిర్లిప్తుడుగానుండి అంట కుండ, ఫలేచ్ఛలేకుండ, ఈశ్వరుడెట్లు ప్రవర్తించుచున్నాడో! అట్లేమనుష్యుడును ప్రవర్తించుచుండినచో, తప్పక మోక్షమును పొందును. అట్టివాడు కర్మయందు అకర్మను జూచును. అట్టి వానికి నిషిద్ధకర్మ యేదియో తెలియుచుండును. ఏకర్మల యందు కామముండునో, ఏవికామము లేకుండ జరుగనేర వో, అట్టికర్మలన్నియు నిషిద్ధకర్మలని చెప్పబడును. దొంగ తనము, వ్యభిచారము మొదలైనవన్నియు నిట్టి కర్మలే! ఇట్టి కర్మలను నిర్లిప్తుడై యెవడును చేయజాలడు. కనుక, నెవడు కోరికను సంకల్పమును-వదలి కర్తవ్యకర్మను చేయుచుండునో,

అట్టివానికర్మలు జ్ఞానాగ్నివలన దగ్ధములైనవని చెప్పవచ్చును. ఈవిధముగా కర్మఫలాసక్తిని వదలువాడు నిత్యసంతుష్టుడుగా నుండును. అతనిమనస్సు స్థిరముగా నుండును. వాడేవిధమైన సంపాదనయందును చిక్కుకొనడు. ఆరోగ్యవంతుని శరీర ధర్మములు సహజముగానే జరుగుచుండును. నేనే సహజముగా చేయుచున్నానను నభిమానమాతనికుండదు. అతడు నిమిత్తమాత్రుడుగా నుండును. సఫలమైనపుడు ఉప్పొంగడు. నిష్ఫలమైనపుడు నిరాశచెందడు. అతని సర్వకర్మలు యజ్ఞరూపములు సేవార్థములగును. సర్వవ్యాపారములందును, యీశ్వరునే చూచును. అంతమందు యీశ్వరునేపొందును.

పలువిధములగు యజ్ఞములు చెప్పబడినవి. అన్ని యజ్ఞములకు మూలము పవిత్రత, సేవయును, ఇంద్రియదమనము ఒక విధమగు యజ్ఞము. దానముచేయుట మరియొక యజ్ఞము. ప్రాణాయామాదులు శుద్ధికొరకు చేయుయజ్ఞములు. వీనిని జ్ఞానముగల గురుముఖమున దెలిసికొననగును. తెలిసికొనకయే జ్ఞానపూర్వకములని అనేకక్రియలను ప్రారంభించినయెడల, అవి అజ్ఞానజన్యములగుటచే శ్రేయమునకుబదులు కీడు గలుగ చేయును. కనుక ప్రతికార్యమును జ్ఞానపూర్వకముగా చేయుట అత్యావశ్యకము.

ఈజ్ఞానము అక్షరజ్ఞానము కాదు. దీనియందు శంకకు స్థానము లేదు. శ్రద్ధతోనే యిది ప్రారంభించును. చివరకు అనుభవము కలుగును. ఇట్టి జ్ఞానముచే మనుష్యుడు సర్వభూతములను; తనయందు జూచును. తనను యీశ్వరునియందు జూచును.

అనగా సర్వము—ప్రత్యక్షమైనట్లు ఈశ్వరమయముగా కన్పించును జ్ఞానము పాపులలో మహాపాపినైనను యుద్ధరించును. ఈ జ్ఞానము మనుష్యుని కర్మబంధనమునుండి విడిపించును. అనగా కర్మఫలము లతనికంటవు. ఈజగత్తున జ్ఞానముకంటె పవిత్రమైనదేదియును లేదు. గనుక నీవు శ్రద్ధతో ఈశ్వరపరాయణుడవై, ఇంద్రియములను వశమందుంచుకొని, ఈ జ్ఞానమును పొందుటకు ప్రయత్నించుము. దీనివలన నీకు పరమశాంతి కలుగును.

---

## ప్రార్థన. 22.

ప్రార్థన నాజీవితము కాపాడినది. అదిలేకున్న నేను చాల కాలము క్రిందటనే పిచ్చివాడనై యుందును. నేను ప్రజాహిత జీవితమునందును, గృహకృత్యములందును, అనేక చిక్కులు పడినట్లు, వానివలన నిరాశచెంది మనస్థితము చెడినట్లును, నా ఆత్మకథవలన తెలియగలదు. కాని, ప్రార్థన వలననే అట్టి దుస్థితినుండి మేలుకొనగల్గితిని. నా జీవితమునందు సత్యమెట్లు లీనమైయుండెనో, ప్రార్థన అట్లులీనమై యుండలేదు. అవసరము కొలది ప్రార్థనభావము నా కంకురించెను. ప్రార్థన లేకున్నచో జీవితమునందు సౌఖ్యమేలేని స్థితివచ్చినది. దేవుని యందు నావిశ్వాసము అభివృద్ధి యైనకొలది ప్రార్థనయందాశక్తి అధికమయ్యెను. నేను దక్షిణాఫ్రికా యందుండగా క్రైస్తవ ప్రార్థనకు హాజరైయుంటిని. కాని, వారిప్రార్థనలో నేను పాల్గొనలేకుంటిని. దేవునియందు, ప్రార్థనయందు నమ్మకము అంతరించెను. తరువాత కొన్ని సంవత్సరములవరకు నా

జీవితమునందు ప్రార్థనలేని వెలితియే లేదాయెను. కాని, కొలది కాలమునకు శరీరమునకు భోజనమెట్లు అవశ్యకమో ఆత్మకు ప్రార్థన అంత అగత్యమని గుర్తించితిని. నిజమునకు శరీరమున కాహారమునకన్న ఆత్మకు ప్రార్థన మిక్కిలి యవసరము. ఏలన, ఆరోగ్యమునిమిత్తమై కొన్ని సమయముల యం దుపవసింపవలసి వచ్చును. కాని, ప్రార్థన విషయములో అట్లు మానుకొనవలసిన అవసరము లేదు. ప్రార్థనకు మితమనునది లేదు. ప్రపంచమంతటి ప్రధాన గురువులగు, బుద్ధుడు, క్రైస్తు, మహమ్మదు ప్రార్థనావశ్యకతను ఋజువు పరచియుండిరి. ప్రార్థన వలననే జ్ఞానము కలదనియు, ప్రార్థనలేనిది జీవింపజాలమనియు చెప్పియుండిరి.

కోట్లకొలది మహమ్మదీయులు, హిందువులు, క్రైస్తవులు సైతము ప్రార్థన ద్వారానే మోక్షము గాంచుచున్నారు. ఇట్టి వీరందరును మాయ మాటలు పలుకువారనిగాని, ఆత్మ వంచకులనిగాని, మీరు దూషించవచ్చును. కాని, యిదినిజముగ ఆత్మవంచనయైన యెడల, సత్యాన్వేషినైన నాకు ఆట్టి ఆత్మ వంచనవల్లనే ఒక దివ్యమైన ప్రభావము లభించుచున్నది. కనుక, నా జీవితమునకు ప్రాణప్రదమైన, ఆధారభూతమైన, యీ దివ్య ప్రభావమును, నేను విడనాడజాలను. రాజకీయ వాతావరణము చాల నిరాశాయుతముగ నున్నను నామనశ్శాంతికి భంగము కలుగలేదు. కొందరు నాస్థితికి ఆశ్చర్యపడుచుందురు. అట్టిశాంతి నాకు ప్రార్థనవలననే కలిగినది. నేను జ్ఞానినిగ చెప్పుకొనజాలను. కాని ప్రార్థనపరునిగ చెప్పుకొనగలను.

ప్రార్థన యేరూపముగ నున్నను చింతలేదు. ఆ విషయమున యెవరియిష్టము వారిదే! కాని, కొన్ని రాజమార్గములను పూర్వీకులు యేర్పరచి యున్నారు. ఆమార్గ మనుసరించుట మేలు. నా స్వానుభవము చెల్పితిని. ప్రతివారును యీవిషయమై ప్రయత్నించి, తన అనుదిన ప్రార్థనవలన తన జీవితమునకు నూతనవికాసము కలిగినట్లు తెలిసికొనుగాక. అట్టిశోభతో పోల్పదగినదేదియు లేదు.

(ఒక మహమ్మదీయ యువకుడు మహాత్ముని యీ క్రింది విధమున ప్రశ్నించెను. కాని, మీరు దేవునియందు నమ్మకముతో ప్రారంభింతురు. మేము అపనమ్మకముతో ప్రారంభింతుము. అట్టిచో ప్రార్థనయెట్లు జరుగును ?)

నీకు దేవునియందు విశ్వాసము కలిగించుట నాతరముకాదు. కొన్ని విషయములు పైదృష్టికి రుజువు చేయగలవియు, కొన్ని రుజువు చేయజాలనివియు నుండును. సహేతుకముగ వాదించి రుజువుచేయుట దుర్లభము. వాదనకు దిగినచో దేవుడు లేడని వాదించుచు అనేక నిదర్శనములు చూపించవచ్చును. ఆస్తికత హేతువాదమును మించినది. దేవుడు న్నాడని సహేతుకముగ వాదించి నీకు బోధచేయ యత్నించుట నిజ్ఞానము నవమానించినట్లగును. హేతువాదము అన్నియు వెనుబెట్టి, చిన్న పిల్లలవలె నమ్మవలెను. నేను జీవించియున్నట్లే, దైవము కూడగలడని నమ్మవలెను. నా జీవమున కాతడే కారణము. ఆట్లే కోట్లకొలది జనులు నమ్ముచున్నారు. ఆనమ్మకముగూర్చి వారు తెలుపలేక పోవుదురు. కాని, అట్టినమ్మకము వారి జీవితములో

నిమిడియున్నదని వారిజీవిత విధానమువలన మీకు తెలియగలదు. మీలోనుండి దొలిచివేయబడిన విశ్వాసమును తిరిగి నెలకొల్పుడు. అట్లు చేయుటకు మీరు యిదివరకు నేర్చినది చాలమరచిపోవలసియుండును. నాకేమియు తెలియదు. నేను పరమాణువుకన్న అల్పుడను అను అభిప్రాయముతో ప్రారంభించవలెను. అణువుకన్న అల్పులమని యెందులకంటిననగా, అనువు ప్రకృతినియమములననుసరించుచు మనము మనవిజ్ఞానాతిశయమున దానిని సైతము అతిక్రమించెదము. విశ్వాసములేనివారికి నేనేమియు చెప్పజాలను.

దేవుడున్నాడని యొకసారి అంగీకరించినచో ప్రార్థననుండి తప్పించుకొనజాలము. మన జీవితమంతయు ప్రార్థనతో కూడినదిగాన వేరుగ ఒకసమయము నిర్ణయించుకొని ప్రార్థన చేయనవసరములేదని అనరాదు. సర్వదా దైవసాన్నిధ్యమునందేయుండి, సర్వదా ధ్యానించుచుండువారుగూడ మనకొరకు నియమితకాలమున ప్రార్థనలు చేయుచుందురు. ప్రార్థనదేవునియందు-విశ్వాసము కలదని ప్రమాణము చేయుట-అట్టి ప్రమాణమును దేవుడుకోరడు, గాని అనుదినము మనము ప్రమాణము గైకొనుచుండవలెను. అట్లుచేయునపుడే మనకెట్టి చింతయునుండదు.

అత్యుత్తమ కర్మయోగులలో మహాత్ముడొకడు ప్రపంచమంతటికిని యుపదేష్టగా నుండదగిన ప్రశస్తభాగవతుడు. భయవిరహితుడు, అహింసావ్రతదీక్షాపరుడు, సత్యాగ్రహి.

(యి.యమ్. వాడియా 6వ. దార్శనికసభాధ్యక్షుడు)

దేవుని కుమారుడు యిపుడు యిచటనే యుండగా మీరు

దేవునిగూర్చియు, దేవునికుమారుని గూర్చియును, అతడు మరల భూమిమీదనవతరించుటను గూర్చియు నఱమేలసంభాషించెదరు?

ఇట్టి నాయకుడు యిదివరకొక్కసారిమాత్రమే ప్రపంచము నందవతరించెను. అపుడు దేవునికుమారుడు ఏసుక్రీస్తుగా నవతరించెను; నేడు గాంధిజీగా నవతరించెను.

(రివరెండు హోమ్సుగారు, అమెరికా).

(రవీంద్ర నాధటాకూరు.)

ఆయన శరీరబలమేమియును లేదు. ధనబలమును లేదు. నేడు మహాత్మునకుగల ఆత్మశక్తి ప్రపంచములో మరియెవ్వరికినిలేదు.... అంతయు నంధకారమయముగా నున్నకాలమున నిచ్చటి ప్రజలను కాపాడి వారికష్టములను తొలగించుటకై యొకవ్యక్తివచ్చెను. అతడు వారిగుమ్మములదగ్గరకే వచ్చెను. వందలకొలది యేండ్లకు పూర్వము పుట్టిన శిశువు మానవునికన్న తేస్థానమునిచ్చెను. ఇదియొక యంత్రముగాదు. ఒకసంఘము గాని, సంస్థగాని కాదు. కేవలమొక మానవశిశువు. అందరు నాశ్చర్యపడిపోయిరి. ఈయంత్రసాధనము లన్నియు త్రుప్పుబట్టిపోయిననాడు, ఈశిశువు జీవించియేయుండును....మీరా పరమేశ్వరుని సమీపించినప్పుడే శాంతిని బడయగలరు.

(ఇర్విన్ ప్రభువుగారు.)

గాంధిగారి పద్ధతి సరియైనదికాదని కొందరు తలపవచ్చును. అతనిపద్ధతివలన చాల అనర్థకము కలిగినట్లు కనబడవచ్చును. గాని, గాంధిగారు అత్యధికముగా భారతమును ప్రేమించుచున్నారనియును, తన ఆధ్యాత్మికశక్తివలననే దీనిని సాగిం

చుచున్నారనియును ఎల్లవారునుగూడ ఒప్పుకొనక తప్పదు. (అని ది 17-1-1931 తేదీని భారతశాసనసభలో ఇర్విన్‌ప్రభువు నుడివెను.)

## రోమైను రోలండుగారు

మృదుల నీల నేత్రములు, దుర్బలమగు హ్రస్వకాయము పలుచని మొగము, ప్రస్ఫుటవిశాల నేత్రములు, తలపైనిదెల్ల టోపీ, ఒంటిపైని ముతకబట్ట, పాదరక్షలులేని పాదములు, ఆహారము వరియన్నము, పండ్లు, మంచినీళ్ళు పరుండునది భూమిపైని, అల్పనిద్ర, నిరంతరకృషి, మనిషిలో విశేషమేదియును పైకి కనబడదుగాని, అపారమగు ఓరిమియును, అపారమగు ప్రేమయును, అజేయమగు ఆత్మశక్తియును, వెంటనే మనకు గోచరించుచుండును. ఆతడే గాంధిమహాత్ముడు.

## మిస్ గ్రాహాము పోలకు కన్యగారు.

చాలమంది స్త్రీలుపురుషులలో నుండు పౌరుషగుణములకే వారిని ప్రేమించెదరు. కాని, గాంధిమహాత్మునిలో నున్న స్త్రీ సహజములగు గుణములకే చాలమంది స్త్రీలతనిని ప్రేమించిరి. విశ్వాసము, ధైర్యము, భక్తి, ఓరిమి, ప్రేమ, సానుభూతి మున్నగునవి స్త్రీలయందును, మహాత్మునియందును చాల హెచ్చుగనున్నవి. కావున స్త్రీలమధ్యను మహాత్ముడుండుట తటస్థించినచో వారికి తనపైని పవిత్రమగు ప్రేమకల్గునే గాని విషయసంబంధమగు ప్రేమకలుగదు.

## అమెరికాలోని న్యూయార్కు వరల్డు పత్రిక.

భారతీయులు తలచినట్లు గాంధిగారు దేవాంశ సంభూతుడే

కావచ్చును. బ్రిటనుదేశపు అతివాదులు తెలిపినట్లు గాంధిగారు అర్ధదిగంబరుడును, పిచ్చివాడే కావచ్చును. అతడు దేవుడైనను కానిండు. వైరివాడైనను కానిండు, ప్రపంచము నిదివరకవతరించిన నాయకు లందరిలోను ఆతడగ్రగణ్యుడు.

## బిషపు వైటుహెడుగారు

ధర్మము కొరకును కనికరము కొరకును గాంధిగారు ఓరిమితో కష్టముల ననుభవించుచున్నారు. శిలువవేయబడిన జగద్రక్షకునకు గాంధియే నిజమైన ప్రతినిధియగునుగాని, తక్కిన వారు కారు.

## రిప్పను క్లోజుగారు.

గాంధీగారిపుడు ప్రపంచముల కంతటికిని, అసదృశుడగు నాయకుడు. అహింసా ప్రేమతత్త్వోపదేశకుడు (4-.-1931 న్యూయార్కు రేడియో)

## బోయుడు డబ్ల్యు టక్కరుగారు.

ఇపుడు ప్రపంచమునందున్న వారందరిలోను గాంధిగారిలో ఆధ్యాత్మికశక్తి ప్రబలతమముగా యున్నదని నేను తెలిసికొంటిని. గాన నేను గాంధిమహాత్ముని శిష్యుడను. భగవంతుడే గాంధిగారిరూపమున మరల నవతరించెనని నేను నమ్ముచున్నాను. సర్వవిధములగు దౌర్జన్యములను, హింసలను, సాంఘిక కలహములను జాతి మత ద్వేషములను రూపుమాపుటయే గాంధి అవతారముయొక్క ప్రయోజనము.

---